శ్రీశారదాంబాయైనమః

# శ్రీ సర్పపుర క్షేత్ర మాహాత్మ్యము

(కూచిమంచి తిమ్మకవి కృతము)

ప్రథమ ముద్రణము 1,000 ప్రతులు.

కాకినాడ:

పట్టమట్ట శేషగిరిరావుగారి జార్జిప్రెస్‌యందు ముద్రింపఁబడి

సర్పవరం దేవస్థాన ట్రస్టీలచే ప్రకటితము.

1949.

వెల రు 0-10-0.

# విజ్ఞాపన

ఆర్యులారా,

రమారమి యాఱేఁడు సంవత్సరములనుండి యీగ్రంథముకొరకుఁ ప్రయత్నించగా శ్రీ సర్పవరం దేవస్థానములో 'ఆనరరీ సూపర్వైజరు' అగు శ్రీ కె. ఆర్. ఎస్. నారాయణరావుగారికి పుస్తకము కాకినాడ తాలూకా పండూరువాస్తవ్యులగు శ్రీ అవసరాల అచ్చన్నపంతులుగారి కుమారుఁడు రిటైర్డుపోలీసు అసిస్టెంటు ప్రాసిక్యూటింగు ఇనస్పెక్టరగు శ్రీ వెంకట అప్పారావుగారియొద్దనున్నటులఁ దెలియవచ్చినది. ఆయననడిగిన తక్షణమే యానందముతో నీప్రతిసమర్పించినందులకు వారికిని, దానినచ్చొత్తించుటకు ననుమతిఁ గోరగానేయొసగిన శ్రీ హిందూరిలిజియస్ ఎండోమెంటుబోర్డు వారికిని, మాకృతజ్ఞతాపూర్వక వందనములు.

ఇట్లు

కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి,

మేనేజింగు ట్రస్టీ.

సర్పవరం దేవస్థానము.

# ట్రస్టీలు.

1. దివాన్ బహాదరు శ్రీకొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడుగారు:
మేనేజింగుట్రస్టీ.

2. శ్రీ పైండా రామకృష్ణయ్యగారు.

3. శ్రీ గుడిమెట్ల వెంకటరావుగారు

4. శ్రీ బచ్చు చినవెంకటరాయుడుగారు
అసోసియేటెడ్ ట్రస్టీ.

5. శ్రీ కాఫ్లూరి రామచంద్ర సత్యనారాయణరావుగారు
ఆనరరీ మానేజరు.

# పీఠిక.

---

అపూర్వకథారచనాయోగంబునం బ్రసిద్ధి గాంచినసర్వపురమాహాత్మ్యంబును నచ్చతెనుంగుగబ్బములలో నొక్కఁడై వన్నెకెక్కిన నీలాసుందరీపరిణయంబును శ్రీమత్కూచిమంచి తిమ్మకవిప్రణీతములు. ఈతిమ్మయ లోకంబున నభినవవాగనుశాసనుఁ డనియుఁ గవిసార్వభౌముఁ డనియు బిరుదులఁ గాంచిన మహాకవి

ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. కౌండిన్యసగోత్రుఁడు. బయ్యనామాత్యునిమునిమనుమఁడు. ఇతనిపితామహుఁడు తిమ్మయ. తండ్రి గంగనామాత్యుఁడు. తల్లి లక్ష్మమ. జగ్గన సింగన నరసన యను నితని పెదతండ్రులు. వీరమ పాపమ యను మేనత్తలు. రాజనయు జగ్గనయు సూరనయు సహోదరులు. తిమ్మనయు సింగనయుఁ బెదతండ్రికొడుకులు. భార్య బుచ్చమ. ఈతని నివాసస్థలము గోదావరీమండలమందలి *పీఠికాపుర సంస్థానములోని కందరాడ యను గ్రామమనియు నితఁ డాయూరికరణ మనియుఁ దెలియవచ్చెడిని. ఇతఁడు పుట్టి పెరిఁగినతావు చంద్రమపాలెము.

ఇతఁడు దెందులూరిలింగనారాధ్యదేశికేంద్రదత్తమాహేశ్వరాచార్యవృత్తిరతుఁడైనను కేవలశైవుఁడు గాక యద్వైతమతమే యవలంబించినట్లితనిగ్రంథములవలనఁ దెలియవచ్చుచున్నది. కావుననే భావనారాయణస్వామి తిమ్మకవికి స్వప్నమునందు సాక్షాత్కరించి.

“శివునకు నాకును భేదము లవమాత్రము లేదు. ... ... ...

కృతులు శంభునకిడినసత్కీర్తి నీవు ప్రతిభ మెఱయంగ నొక్కసత్కృతి
నొనర్చి మాకు నర్పణసేయు.”

మని కోరఁగా గ్రంథమును రచించి యాదేవునకు సమర్పించినట్లీసర్వపురమాహాత్మ్యములోఁ దెల్పఁబడియున్నది.

ఈకవి పీఠికాపురసంస్థానమునకుఁ బ్రభువైనరావుమాధవునికాలములో నుండి కృతులువ్రాసి కవిసార్వభౌముఁడు లోనుగా బిరుదులంబడసి యున్నట్లు

---

* పీఠికాపురమునకే పీఠీపురమనియు, పీఠపుర మనియు నామాంతరములు. దీనికిప్పుడు పిఠాపుర మనిప్రసిద్ధి.

తెలియుచున్నది. ఈతని రెండవకృతియగు రుక్మిణీపరిణయము హూణశకము 1715 సంవత్సరమున రచియింపఁబడియుండుటచేతను నీతనికి కడపటికృతియగు శివలీలావిలాసము హూణశకము 1756 వ సంవత్సరమందుఁ జేయఁబడియుండుటచేతను నీతిమ్మకవి హూణశకము పదునెనిమిదవ శతాబ్దారంభమునకుఁ గొంచెము పూర్వము జనించి తచ్ఛతాబ్దమధ్యముదాఁక జీవించియుండినట్లు గనఁబడుచున్నది

ఈకవి రచించినగ్రంథములలో నిప్పుడు ప్రసిద్ధము లైయుండున వేవనఁగా.

1. రాజశేఖరవిలాస మనునామాంతరముగల భల్లాణచరిత్రము.
2. హూ. శ. 1715 వ సంవత్సరమున రచియింపఁబడిన రుక్మిణీ పరిణయము.
3. సింహాచలమాహాత్మ్యము.
4. నీలాసుందరీపరిణయము.
5. అచ్చతెనుఁగు రామాయణము.
6. సారంగధరచరిత్రము.
7. సాగరసంగమాహాత్మ్యము.
8. హూ. శ. 1740 వ సంవత్సరమున వ్రాయబడిన లక్షణసారసంగ్రహము.
9. బ్రహ్మపురాణోక్తమగు గోదావరీఖండమందలివృద్ధ స్రవంతీసరిత్పతిసంగమ మాహాత్మ్యమున ననుసరించి హూ. శ. 1750 సంవత్సరమందుఁ దెలుఁగుగా వ్రాయఁబడిన రసికజనమనోభిరామము.
10. హూ, శ. 1754 వ సంవత్సరమున రచియింపఁబడిన సర్పపుర మాహాత్మ్యము.
11. హూ. శ. 1756 సంవత్సరమందు వ్రాయఁబడిన శివలీలావిలాసము.

ఈగ్రంథములేగాక యనేకశతకదండకసత్కృతులీకవిరచియించినట్టు కన్పట్టుచున్నది.

ప్రబంధరాజవేంకటేశ్వర విజయవిలాసమును వ్రాసినగణపవరము వేంకటకవి కీవలసిన్ని యాంధ్రగ్రంథములు వ్రాసి కీర్తిగన్నవాఁ డితఁడొక్కఁడుఁడే. శివలీలావిలాసము కడపటఁగవి తా నాప్రబంధమును ముప్పదియొక్క దినములలో రచించినట్లు వ్రాసియుండుటంజూడ గా నీతనికవితాధోరణి యనర్గళప్రవాహమువంటిదని చెప్పవచ్చును.

ఈతనికవిత్వము ప్రాయికంబుగ శబ్దసౌష్ఠవముగలదై మేలైనశయ్యతోఁగూడి చదువునపుడు చెవులకింపై యుండును. కావుననే యీతనిచుట్టంబైన యేనుఁగులక్ష్మణకవి యొకప్పుడీతని కవిత్వంబును శ్లాఘించి తనసమీపముననున్న పండితులం జూచి

"హాటకగర్భవధూటీ లాటనచలితాంఘ్రినూపు రారావశ్రీ
పాటచ్చరములు తేనియ తేటలు మాకూచిమంచితిమ్మయమాటల్"

అని చెప్పినట్లు ప్రసిద్ధికలదు. ఇతనివంశమునఁ బుట్టినవారికెల్లఁ గవిత్వరచనా సామర్థ్యం బొక్కింతయేని నలవడియుండకపోదు.

శ్రీశారదామ్బాయై నమః

# సర్పపుర మాహాత్మ్యము



## ప్రథమాశ్వాసము.

శ్రీయును నీళయున్ ధరయుఁ ♦ జేరి భజింప నిలింపు లింపుగాఁ
బాయక సామగానరుచిఁ ♦ బ్రస్తుతి సేయ సుపర్వశేషు ల
త్యాయతభక్తిఁ గొల్వ నన ♦ పాయసుఖోన్నతిఁ బొల్చుభావనా
నాయణదేవుఁ డిచ్చు నతి ♦ నైకశుభంబులు భక్తకోటికిన్.

### ఇష్టదేవతాది ప్రార్థనము.

సీ. సనకాదిమునిమనో ♦ బ్జములు లాటపట్టులు, హరియురస్స్థలముసింహాసనంబు
సకలబృందారక ♦ సతు లూడిగపుఁజెలుల్, పాలుపారుపాలేఱు ♦ పుట్టినిల్లు
నలుమొగంబులవేల్పు ♦ పులపెద్దతొలుపట్టి, జగతీసతీమణి ♦ సవతిమిన్న
కలువలచెలికాఁడు ♦ గాదిలిసైదోడు, బ్రహ్మాండములు రంగ ♦ భవనములును

తే. గాఁగ వేదాంతవీథులఁ ♦ గలసిమెలయు, నఖిలలోకైకజనయిత్రి ♦ యాదిదేవి
యిందిరాసుందరాంగి మ ♦ న్మందిరమునఁ జెలఁగి నిత్యంబు నృత్యంబు సేయుఁగాత

ఉ. శ్రీనగజాఘనస్తనవి ♦ సృత్వరసంకుమదైణనాభిపం
కానిశవాసితస్ఫుటభు ♦ జాంతరుఁ డిందుసుధాశయస్పర్ధ
గ్ర్యాభమతకీర్తి పీఠపుర ♦ కుక్కుటలింగమహాప్రభుం డశే
షానతభక్తపాలన ప ♦ రాయణుఁ డీవుత మాకభీష్టముల్. 3

క. మగనిసగమేన నెలకొని, ముగురంబలయందు నాది ♦ మూలంబగుచున్
జగ మేలుసర్వమంగళ, జగమే లిడుఁగాత మాకు ♦ సమ్యక్కరుణన్,

ఉ. పాయక తమ్మిగద్దె నన ♦ పాయసుఖోన్నతి నుండి దేవతా
నాయకముఖ్యులున్ మునిజ ♦ నప్రవరుల్ గొలువన్ జగంబు ల
త్యాయతలీల నేలుచతు ♦ రాననుఁ డానరనైకబుద్ధి దీ
ర్ఘాయురభీప్సితార్థములు ♦ దారత మాకు నొసంగుఁగావుతన్. 5

శా. పాణిద్వంద్వము మోడ్చి మ్రొక్కెదను శుం ♦ భద్భంభరీవేణికిన్
మాణిక్యాంగదమేఖలావలయస ♦ మ్యగ్భూషణశ్రేణికిన్
వీణాపుస్తకపాణికిన్ సురుచిరో ♦ ర్వీభృన్నిభశ్రోణి క
క్షీణక్షేమకటాక్షరక్షితమహా ♦ గీర్వాణికిన్ వాణికిన్. 6

చ. కరములఁ దోయిలించి కుతు ♦ కంబున నిచ్చలుఁ బ్రస్తుతింతు భా
స్వరగుణవంతునిన్ సకల ♦ సత్కవిజాలవనీవసంతునిన్
జిరకరుణానిశాంతుని వి ♦ శిష్టజనావనసుప్రశాంతునిన్
సురతరుమంజరీనిభయ ♦ శోహరిదంతుని నేకదంతునిన్. 7

చ. ముదమునఁ గేలుఁదామరలు ♦ మోడ్చి నమస్కృతులాచరింతు బ
ల్లిదుఁ డగుదెందములూరికుల ♦ లింగయసద్గురునాథమూర్తికిన్
సదమలశీలికిం ద్రిపుర ♦ సంహరపాదసరోరుహాళి కు
న్మదపరవాదిమండలత ♦ మస్సముదాయమయూఖమాలికిన్. 8

సీ. గురుతరకౌండిన్య♦గోత్రవిఖ్యాతుండు, బయ్యనామాత్యుఁడే ♦ ప్రభునితాత
నిరతాన్నదానవ ♦ ర్జితయశస్సాంద్రుండు, తిమ్మనసచివుఁడే ♦ ధీరుతండ్రి
ఘనులు జగ్గనయు సింగనమంత్రియును నర, సన్నయు నేధన్యు♦ననుజవరులు
తిమ్మయాఖ్యుఁడనేఁ బ్రి ♦ థితులు సింగనయు జ, గ్గనయు సూరనయు
నే ♦ యనఘుసూను

తే. లతులమతి రాజమాంబయే♦యధిపుజననియతిపతివ్రతలక్ష్మియే♦చతుసారి
యట్టి శ్రీకూచిమంచివఁ ♦ శాబ్ధిచంద్రుమజనకుగంగనామాత్యు♦మదిదలంతు.

తే. వ్యాసవల్మీకభవ కాళి♦దాసమాఘ, చోరభారవి బాణమ ♦ యూరభోజ
దండిభవభూతిముఖ్యవి♦ద్వత్కవీంద్ర, శేఖరులనెంతుఁగావ్యసం♦సిద్ధికొరకు.

ఉ. నామది నెప్పుడుం దలఁతు ♦ నన్నయఁ దిక్కన నెఱ్ఱప్రెగ్గడన్
భీమకవీంద్రు భాస్కరుని ♦ వీరకవీంద్రుని రంగనాథునిన్
సోమునిఁ బోతసత్కవిని ♦ సువ్రతులై బహుళాంధ్రకావ్యముల్
నేమ మెలర్పఁ జెప్పియవ ♦ ని న్నుతిగన్న మహానుభావులన్. 11

క. కుకవు లనువారు గలఁగఁగ, సుకవులకుఁ బ్రకర్ష గలిగె♦సులభంబుగ నూ
రక యే భువనోపకృతులఁ గుకవుల నిరసింపవలదు♦ గుణమాన్యులకున్. 12

వ. అని నిఖిలదేవతాప్రార్థనంబును గురుచరణస్మరణంబులు మహాకవివర్ణనంబును గావించి యేనొక్కపుణ్యచరిత్రంబు రచియింపం బూనియున్న సమయంబున నొక్కనాఁడు. 13

## స్వప్నవృత్తాంతము

సీ. తెలిదమ్మిరేకులఁ దెగడుకన్నులవాఁడు, తొగవిందు నగుముద్దుమొగము వాఁడు
వలమురియును జుట్టువాలుఁ బూనినవాఁడు, సిరియు మచ్చయు నెదఁ బెరయువాఁడు
తొలుమొగుల్ నెగడిగి దొరయు నెమ్మెయివాఁడు, జాళువాహొంబట్టు సాలువాఁడు
బలుదమ్మికెంపు టాపతకంబుగలవాఁడు, వలపేరి గమకించు చెలువువాఁడు
తే. ఒక్కటపుఁబక్కరాజెక్కి నెక్కువాఁడు, సర్పపురినుండి జగములు సాఁకువాఁడు
భావనారాయణుఁడు మహాప్రభుఁడు నాకు, నెలమిఁ గలలోనఁ బొడగట్టి యిట్టు లనియె.

సీ. ప్రౌఢిమై రుక్మిణీపరిణయంబును సింహశైలమాహాత్మ్యంబు నీలపెండ్లి
కథయును రాజశేఖరవిలాసంబును, నచ్చతెనుంగు రామాయణంబు
సారంగధరనరేశ్వరచరిత్రంబు సప్తార్ణవసంగమాహాత్మ్యకంబు
రసికజనమనోభిరామంబు లక్షణసారసంగ్రహము నింపారఁ గూర్చి
తే. కృతులు శంభునకిడినసత్కృతివి నీవు, ప్రతిభ మెఱయంగ నొక్కసత్కృతి యొనర్చి
మాకు నర్పణసేయు నెమ్మదిదలిర్పఁ, దిమ్మకవిచంద్ర ముదితసుధీకులేంద్ర

క. శివునకు నాకును భేదము, యవమాత్రము లేదు నేనె యతఁ డాతఁడ నే
నవిరళమతి సర్పపుర,ప్రవిమలమాహాత్మ్య మాంధ్రభాషం జెపుమా. 16

వ. అని యానతిచ్చి యప్పరమేశ్వరుం డంతర్హితుం డైన నేను నత్యంతసంతుష్టాంతరంగుండనై. 17

## షష్ఠ్యంతములు

క. నారదమునిపూజితపద, నీరజునకు సకలభువన♦ నిర్మాణకళా
పారగునకు నతజనసుర, భూరుహునకు విమతభయద♦భుజసారునకున్. 18

క. కలశాబ్ధికన్యకాకుచ, కలశాంకితగంధసార♦ ఘనసారవిని
ర్మలసౌరభసంవాసిత, కలితోన్నతవక్షునకును♦ కమలాక్షునకున్. 19

క. శారదనీరద నారద, పారద నీహారహార ♦ పాటీర సుధా
పూర దరాంచితయశున క. పారదయాస్వాంతునకును♦ భగవంతునకున్.

క. పతగాధిప కేతనునకు, శతధృతిముఖనిఖిలదివిజ ♦ సంఘాతప్ర
స్తుతచరణసరోరుహునకు, శ్రితజనహితచరితునకును♦జితదురితునకున్. 21

క. స్వర్పతినుతచరణునకున్, దర్పోద్ధతదనుజకులవి♦ దారణునకు కం
దర్పాయుతసుందరునకు, సర్వపురాధీశునకును♦ జగదీశునకున్. 22

వ. సమర్పణంబుగా నారచియింపం బూనినసర్వపుర క్షేత్ర మాహాత్మ్యంబను
పుణ్యచరిత్రంబునకుం గథావిధానం బెట్టి దనిన.

## కథా ప్రస్తావన

క శ్రీకమలాధిపపదనా, ళీకధ్యానానుమోద♦ లీలానిరతా
స్తోకమహిమాతిశయుదూ, రీకృతభవదోషుం డంబ♦ రీషుండు దనరున్. 24

తే. ఆమహీపాలకులసార్వ♦భౌముఁడొక్క, నాఁడు వేడుకతోసభాం♦తరమునందు
సకలబుధబాంధవామాత్య♦ సహితుఁడగుచుఁ, దవిలి పేరోలగంబున్న ♦
యవసరమున.

క. ఘనుఁడు వసిష్ఠమహాముని, చనుదెంచిన నతని నెదురు♦చని నతులిడి తో
డ్కొని తెచ్చి యర్ఘ్యపాద్యము, లొనరఁగనిడి యుచితపీఠినునిచి కడంకన్.

ఆ. కొంతదడవు విహిత♦గోష్ఠిసంభాషించి,యంతమౌనిఁజూచి♦యవనివిభుఁడు
భువనవంద్య సర్వ♦పురమహాక్షేత్రమా, హాత్మ్య మేవినంగ♦నభిలషింతు.

సీ. అరయంగ సర్వపు♦రాఖ్యాన మెట్టిది, భావనారాయణ♦దేవుఁ డచట
నేమిటి కుదయించి♦ యిలనున్నవాఁడు త, ద్దేవు నెవ్వాఁడు ప్ర♦తిష్ఠచేసె

నందులఁ గల్గుపు♦ ణ్యసరోవరములెవ్వి, యు త్తీర్థములఁ గుఱింకు♦ లాడినట్టి
ఫలమవి యెట్టిది♦ప్రాచుర్యముగనిది, విన డెందమునఁ జాల♦ వేడ్క యొదవె
తే. నీ సమస్తంబు దెలియనా♦ కెఱుఁగఁ జెప్ప,వలయు నని వేఁడుకొనిన న♦వ్యాసు మతీశుఁ
గాంచి మునిమౌళి నెయ్యంబు♦గడలుకొనఁగ, నలర వినుమనియిట్లని♦ దెలుపఁదొడఁగె.

సీ. ఘనమానిమఘఘూమ♦ కనదంబుదశ్యామ. శేముషీపరినట♦చ్ఛిఖివరంబు
పరమతత్త్వవిచార♦ పాండిత్యనైపుణీ, విగతవైరసమస్త♦ మృగకులంబు
గంధర్వగజరాజ♦గామినీజనచిత్ర♦సంగీతముదితభు♦జంగమంబు
విమలమేధోదిత♦ వేదశాస్త్రపురాణ, పఠనసముల్లస♦త్పతగచయము
తే. లాలితోత్తాలదివ్యర ♦ సాలసాల, పల్లవలవానుభవమత్త♦పరభృతౌఘ
మాధురీధుర్యశినదస♦మాకులంబు, పుణ్యగణ్యంబు నైమిశా♦రణ్య మలరు
క. గాలవకౌశిక కలితో, ద్దాలక శాండిల్యముఖ్య ♦ తతపుణ్యాతరుల్
లీలంగ్రాలఁగ శుభఫల, మూలంబై యువ్వనంబు ♦ మురువున నలరున్. 30
తే. అవ్వనంబున వేదవే♦దాంతవిదుఁడు. భగవదంఘ్రిసరోరుహ♦భక్తియుతుఁడు
ఘనుఁడు విజితేంద్రియుఁడు జిత♦కాముఁడనఘుఁ, డలరు శౌనకుఁడనెడుమ ♦ హర్షివరుఁడు

సీ. హరిపదధ్యానత♦త్పరులుగొందఱుగొంద,ఱవిరళాచ్యుతకథా♦శ్రవణనిరతు
లశ్రాంతజపపరా♦యణులుగొందఱుగొంద,ఱగ్నికార్యనిరంతరాభిరతులు
నిగమాగమాంతపా♦రగులు గొందఱు గొంద, ఱబ్జాక్షపూజనా ♦ యత్తమతులు
సతతయోగాభ్యాస♦చరులుగొందఱు గొంద,ఱఖిలపురాణర♦హస్యవిదులు
తే. నగుచు భగవద్గుణస్మృతి♦నహరహంబు, నగుచునాడుచుఁ బాడుచు♦మిగుల వేడ్క
నశ్రుకణముల నెరపుచు♦నమ్మహాత్ము, సభఁజరింతురుపరమర్షి♦జనులులీల.
తే. వచ్చెనచ్చెరువారన♦వ్వనమునకును,సకలజనవంద్యుఁడగుకుంభసంభవుండు
మాధవార్పితహృదయతా♦మరసుఁడైన, యమ్మహాముని దర్శించు♦నభిమతమున. 33

వ. అట్లువచ్చి. 34

తే. గోమతీతీరమందార♦భూమిరుహస, మీపవిధుకాంతమణివేది♦మీదమోద
మమర నాసీనుఁ బ్రైసహ♦స్రాంశుఁ బోలి, యున్నయమ్మునిఁ గని ద్విజు♦
లుత్సవమున.

క. వందనము లిడియమందా, నందంబున నపుడె కొన్ని♦నంబగువిడితా
రందఱు శౌనకునకు నా, చందంబెఱిఁగింప నతఁడు♦సంతస మెసఁగన్. 36

క. కడువడినరిగి యగస్త్యునిఁ, బొడగని యర్ఘ్యాదివిధులఁ ♦ బూజించి నయం
బడరనతులొసఁగియాతనిఁ, దోడుకొనితనమునికి కెలమి♦తోడంజనియెన్ 37

క. చని యర్ఘ్యాసనమున న, య్యనఘుం గూర్చుండఁ జేసి♦ యతనియనుజ్ఞన్
వినయావనతుండై తా, నునుదగఁ గూర్చుండి పలికె♦నూల్కొనుభక్తిన్. 38

సీ. మునినాథవిస్మయం♦బుగ మీరలిందు వేం, చేయుటకతన నే♦ జేసినట్టి
తపముసిద్ధించె నేం♦త యుఁ గృతార్థుఁడ నైతి, సరగ నాజన్మంబు సఫలమయ్యె
మీపదస్పర్శచే♦ మేటిపుణ్యంబుల, కాకరంబయ్యె మ♦దాశ్రమంబు
భవదీయదివ్యకృ♦పానిరీక్షణమున, నిఁక నాకు దుర్లభం♦బెద్ది కలదు

తే. నేనునీయాజ్ఞదలమోచి♦నిచ్చనిచ్చ, మెలఁగువాడనటంచున♦ర్మిలివచించు
శౌనకునిఁ జూచియక్కుంభ♦సంభవుండు, పలికెనిట్లని సాంత్వన♦భాషణముల.

క. నినుఁ బొడగనుకోరికచే. మునివర నేవచ్చినాఁడ♦ముదమున నిటకున్
వినుమింతటికన్నఁ బ్రియో, జనమేమియు లేదు నాకుఁ♦దర్శింపంగన్. 40

క. హరిసంవర్ణనమును శ్రీ, హరిభక్తులదర్శనంబు♦నక్షులకు ఫలం
బరయఁగ శ్రవణంబులకుం, బరువడిఁ దత్కథలువినుట♦ఫలము మునీంద్రా 41

సీ. మత్సరులెల్ల ని♦ర్మత్సరులగుదురు, రాగాన్వితులు వీత♦రాగులగుదు
రజ్ఞు లెల్లను జ్ఞాను♦లగుదురు నిస్పృహు, లగుదు రెంతయు స్పృహా♦యాఘురెల్ల
మహనీయభవదాశ్ర♦మస్థలసంపర్క, మున ననివిశుద్ధం♦బుగ ధరిత్రి
సన్నంగఁ బడుటచే♦ నేనిదిగనుఁగొన, నరుగుదెంచితిఁ ధన్య♦మయ్యె నేఁడు

తే. తాపసోత్తమ నీమహాత్త్వంబు దలఁప, నరిదియనిపల్కుటయు వేడ్కనలరికుంభ
సంభవునిఁజూచి వేఁడియాశౌనకుండు, మృదుమధురవాక్ప్రవీణత మెఱయఁబలికె.

తే. యతికులోత్తంసవినుముతత్త్వావబోధ, శీలుఁడవునీవు నేఁడు వేంచేసియుండు
నడుగువెట్టినకతనమీరమరఁ బనిన,యట్లుకాఁగలదిఁకసంశయంబు లేదు. 43

వ. అనిన నగస్త్యుం డిట్లనియె. 44

తే. సర్వలోకేశ్వరేశుఁడు సర్వకర్త, యఖిలకల్యాణసాగరుఁ డమలమూర్తి
యాదినారాయణుం డాత్మ నతనిఁ దలఁచు, జనుఁ డశేషమహాకిల్బిషముల బాయు.

సీ. కన్నులుభవదంఘ్రికమలదర్శనమున, మృదుకరస్పర్శఁద్వగింద్రియంబుఁ
దత్పదాంబుజసుగంధమున ఘ్రాణేంద్రియం,బునుగడుసంతుష్టిఁబొందె నింకఁ
జెవులుమీవాక్యవైభవము వినంగను, రసనమీవాక్సుధారసముఁగ్రోల
నభిలషించుచున్నవనఘ సర్వేంద్రి,యసుఖావహంబయ్యె నఖిలశుభఫ

తే. లములు నొనగూడె భవదాగమమునమాకు, ననుచు నత్యంతవినయజ్ఞుఁ డగుచునాడి
కలశభవుఁ దద్ద సంప్రీతుఁగా నొనర్చి, యోమునీంద్ర దైవాఱఁ గ్రమ్మఱ నిట్టు లనియె. 46

వ. మహాత్మా విశ్వేశ్వరుండును విశ్వయోనియు విశ్వస్రష్టయు జగత్ప్రభుం
డును ననాదినిధనుండును శ్రీమంతుండును భగవంతుండును నగుపురుషో
త్తముండు సర్వగతుండై యుండియు. ప్రతిమార్చనాదివిధంబుల నచట
నచ్చట గోచరుండై ప్రతిష్ఠాపనామాహాత్మ్యంబున క్షేత్రప్రభావంబున
నర్చకప్రీతివశంబునఁ బూజాధిక్యత్వంబున సాక్షాత్కారుం డగుచుండునని
పౌరాణికజనంబువలన వినంబడుచుండుఁ బుణ్యశ్లోకుండును మహాభాగుం
డు నగునజ్ఞనాగ్రణుండు విశేషించియు నెచటనెచ్చట నధివసించి ప్రకా
శించుచుండుఁ బురాణజ్ఞుండవు సమస్తుండ వనఁబరగు నీవలననేతత్ప్రకారం

బు వినవలయునని మనంబునం గౌతుకంబు విస్తరిల్లుచున్నయది నీవిదినా కుండేట తెల్లంబుగా నెఱింగింపవలయునని ప్రార్థించిన విని యగస్త్యమహా మునీంద్రుం డతనికిట్లని తెలుపందొడంగె.

## కథారంభము

క. ధాత్రి న్మునివర విష్ణు, క్షేత్రంబులు పెక్కుగలవు ♦ సిద్ధం బీష
న్మాత్రం బెక్కువయగునొక, క్షేత్రముగల దదియెరుంగం♦ జెప్పెదవినుమా

తే. పుడమిగోదావరికిందూర్పు♦కడనుదుల్యభాగకునుద క్తటంబున♦బశ్చిమమున
వారిరాశికిం గోసెడు♦ మేరసర్వ,పురమహాక్షేత్రమభిరామ♦గరిమ నలరు.

తే పుణ్యకాసారసహితంబు♦పుణ్యశీలసంవృతముపుణ్యకాంతార♦శస్తమగుచు
సర్వకామార్థదాయిన్మై ♦ సర్వపురము. ఖ్యాతినలరొందు మూండు
లో ♦ కములయందు.

క. నరుండాక్షేత్రమొకప్పుడు, పరువడిస్మరియింపవిడుచు ♦ భవబంధము లా
సరసీజలముల మునిగిన, దురితౌఘము లెట్టివైనం ♦ దొలంగు మునీంద్రా.

తే. నారదసరోవరంబు న ♦ నంతసరసి. ముక్తికాసారమును నన♦మూడుతీర్థ
ములు తరింపగజేయుంబో ♦ తలంచినపుడె,సర్వదురితపరిపూర్ణ లౌ ♦
జంతువులను.

తే.వరదుండుకృపాంబునిధిభక్త♦వత్సలుండుభావనారాయణుండను దేవుండ చట
దనరనారదమునికులో♦త్తమునిచేత,నున్నతింబ్రతిష్ఠితుండయి♦యున్నవాండు

క. మందారశాఖతెఱంగున, వందారుకజనుల నెల్ల ♦ వరఫలముల నా
నందింపంగజేయుచు హరి యందంబుగబుధులుపొగడ ♦ నందుండుజుమీ

చ. అనుటయు శౌనకుండు విన ♦ యాన్వితుడై కలశోద్భవుం గనుం
గొని మునినాథ నారదుండు ♦ కోరికనేమిటి కందుసజ్జనా
ర్దనునిం బ్రతిష్ఠచేసె విది ♦ తంబుగ నచ్చటంగల్గియున్నపా
వనసరసీత్రయంబుఘన ♦ వైభవమెట్టిదెరుంగజెప్పవే. 55

### శేషుఁడు తపంబొనర్చుట

క. అన నాఘటభవుఁడిట్లను, మునుకశ్యపుఁడనెడు పరమ ♦ మునికిం గద్రూ
వనితకుఁ బుట్టినవేవురు. తనయులు: బటుసర్పరూప ♦ ధరులబ్రముగన్.

తే. వారిపైఁదల్లి కొండొక ♦ కారణమున, నలిగిశపియింప నందఱు♦నగ్నితప్త
లైకృశించుచు నున్నచో ♦ నం దనంతుఁ, డనెడుభుజగేంద్రుఁడొకఁడు ర♦
యంబవెడలి.

క. ధరఁ గలపుణ్యస్థలములు, దిరిగి తిరిగి మరలియుదధి ♦ తీరంబున శ్రీ
హరినచ్యుతునభపురమే,శ్వరుఁగూర్చిమహోగ్రతపము♦సలుపఁదొడంగెన్

తే. కుముదకహ్లారకువలయ ♦ విమలకమల, సారసౌరభసహితకా ♦ సారతీర
మున ననేకాబ్దములు నిష్ఠపూనిఘోర. తపముగావించె దివిజబృందములు
పొగడ 59

శా. అక్షీణోగ్రతపస్సమాధి నటు ని♦ద్రాహారముల్ మాని య
ధ్యక్షశ్రీపదపంకజాతయుగళీ ♦ ధ్యానావగాఢాత్ముఁడై
దీక్షం గ్రాలుచునున్నచో హరిరమా♦ధీశుండు విష్ణుండు దా
సాక్షాత్కారముఁ గొండె నభ్రమున నా♦చక్షుశ్శ్రవస్స్వామికిన్. 60

సీ. శంఖచక్రగదాసి♦శార్ఙ్గాయుధములతో,భవ్యజాంబూనదాం♦బరముతోడ
వనమాలికావృత ♦ వక్షస్స్థలంబుతోఁ, గౌస్తుభశ్రీవత్స ♦ కములతోడఁ
బద్మరాగాశ్మకసం♦ఘటితకిరీటంబుతో, నవరత్నమయభూషణములతోడ
సురుచిరహరినీల♦శోభితాంగంబుతో, నండజాధీశవా♦హనముతోడ

తే. నెలమిఁబ్రత్యక్షమై మ్రోల♦ నిలచియున్న; యాదినారాయణునిఁ బర ♦
మాత్ముఁగాంచి
యలర దండప్రణామంబు ♦ లాచరించి యురగకులభర్త దలవాంచి ♦
యూరకుండె. 61

తే. అపుడుకరుణాపయోనిధి♦యైనశౌరి, వానిఁగన్గొనియిట్లను ♦ వత్స యిచట
నిట్టిదుష్కరతరతపం♦బేలచేసె దెవ్వఁడవు నీవు నీకోర్కి♦యెద్దిచెపుమ 62

క. ఉరగా నీతపమునకుం బరితోషమునొంది యేను ♦ బరువడి నీకున్
వరమీనవచ్చితి నడుగుము కరమరుదుగ నెద్దియైనఁ ♦ గడపక యిత్తున్

వ. అని పరమదయాళుండును భక్తవత్సలుండును నగు భగవంతుఁ డానతిచ్చిన హర్షోత్ఫుల్లనేత్రుండును పులకితగాత్రుండును సమాహితచిత్తుండు ను నగుచు ననంతుం డద్దేవు నిట్లు వినుతింపఁదొడంగె. 64

## —— తనకు సాక్షాత్కరించిన విష్ణువును శేషుఁడు పొగడుట ——

రగడ. జయ ముకుంద సమస్తతాపస ♦ జనమనోఽభిలషితదాయక
భయదరక్షోనాథవక్షః ♦ పాటనోద్ధతనఖరసాయక
సజలజలదపురస్సరోపల ♦ సదృశమఙ్గళదివ్యవిగ్రహ
అజసహస్రవిలోచనప్రియ ♦ భ్రామరావళిలసదనుగ్రహ
కలశనీరధికన్యకాముఖ ♦ కమలతరుణసరోజబాన్ధవ
బలవదణ్డజమణ్డలాధిప ♦ భాసమానమనోజ్ఞనవ
వారిజాతహితప్రభాపరి ♦ వాదికౌస్తుభమణివిభూషణ
నారదాత్రివసిష్ఠసనకస ♦ నన్దనాదిమునిప్రపోషణ
ఘోరనరకనిరుద్ధసంశ్రిత ♦ కుఞ్జరేన్ద్రవిపన్నివారణ
సారకరుణాపాఙ్గవీక్షణ ♦ సమ్యగాదృతసిద్ధచారణ
సురమునీన్ద్రజనైకకారణ ♦ శుభకరాఞ్చితపదసరోరుహ
పరమభాగవతాలయాజిర ♦ భాసమాననిలిమ్పభూరుహ
బహుతరోద్భవసఞ్చితాఖిల ♦ పాతకామ్బుధరప్రభఞ్జన
మహితభక్తివిశేషభూషిత ♦ పవనిమానసకఞ్జరఞ్జన
నిజపిచణ్డవిమణ్డితామిత ♦ నీరజాతభవాణ్డమణ్డల
త్రిజగదభినుత దివ్యమణిగణ ♦ దీధితిస్ఫుటమకరకుణ్డల
శతసహస్రార్బుదమనోభవ ♦ సదృశనిర్మలరూపభాసుర
ప్రతిపదాతికృపానిరీక్షణ ♦ పాలితాశ్రితహితమహీసుర
చటులకటితటరాజమానవి ♦ శాలచామీకరనిచోళక
కుటిలదైత్యవరూథినీవర ♦ ఘోరనిర్భరమదవిభాళక
శరశరద్ఘనహారహీరతు ♦ పారచారుయశోవిరాజిత
గరుడకిన్నరయక్షగుహ్యక ♦ ఖచరవిద్యాధరసుపూజిత
దరసుదర్శనశార్ఙ్గఖడ్గగ ♦ దాసమన్వితశయకుశేశయ
చరణసేవకరక్షణాధిక ♦ సమ్మదావృతనిర్మలాశయ

వరదనారాయణ చతుర్భుజ ♦ వాసుదేవ హరే జనార్దన
పరమపురుష పరేశ కేశవ ♦ పద్మనాభ రిపుప్రమర్దన
మనునిషూదన కృష్ణకైటభ ♦ మథన విష్ణో గరుడకేతన
విధిమనోభవజనక భవహర ♦ వేదవేద్య జగత్సనాతన
తరణిహిమకరనయన దోర ♦ స్థిరనిర స్థిరవిలసదిస్థిర
పరమపావన విశ్వమయమాం ♦ పాహి శ్రీవైకుంఠమస్థిర. 65

సీ. దీనబాంధవ కృపా ♦ బ్ధి భక్తవత్సల, రవికోటిధామ పు♦ రాణపురుష
క్షీరాబ్ధిశయన ల♦క్ష్మీమనోవల్లభ, వైకుంఠనాయక♦వాసుదేవ
నిగమాంతసంవేద్య♦ నిర్మలానంతక,ళ్యాణగుణార్ణవ♦ యాదిదేవ
జగదుద్భవస్థితి♦ సంహారకారణ, భూతభావన మహా♦ద్భుతచరిత్ర

తే. పుండరీకాక్ష నీగుణం♦బులు గణింప, నజసహస్రాక్షులకునైన♦నలవిగాదు
బాలిశుఁడనైననేనునిన్ ♦బ్రస్తుతింప,నెంతవాఁడను మునిజన♦స్వాంతభవన

తే. వారిజాతాక్ష యిపుడుభవత్కటాక్ష, వీక్షణంబున నఘములు♦వీడఁబాఱె
క్షుత్పిపాసలు దీఱె నీ♦శుభదమృదుల, వాక్సుధారసపానంబు♦ వలననీశ.

క. నినుస్మరియించినఁ దలఁచినఁ, గనుఁగొన్నను వందనములు♦ గావించిన న
ర్చన లొనఁగిన సజ్జనులకు, ఘనదురితములెల్లఁబాయుఁ ♦ గద జగదీశా.

క. వనజభవ భవ సురేంద్రులు, సనకాదిసమస్తయోగి♦జనులును వేదాం
తనిగూఢార్థజ్ఞానులుఁ, గనలేనిత్వదంఘ్రియుగము ♦ గంటినధీశా. 69

తే అహహ జగముల నాభాగ్య♦మహిమ యెన్న, నరిదియిఁక నింతకంటెనే♦మైనఁగోర్క-
గలదె భవదంఘ్రియుగభక్తి♦గలుగనిమ్ము, చిరతరానందగోవింద♦ శ్రీముకుంద.

### శేషుఁడు తనవృత్తాంతమును విష్ణువునకుఁ దెల్పుట

తే. అయిననెఱిఁగింతు నిపుడుమీ♦ యాజ్ఞవలన, నేఁదపము సేయుకార్యంబు♦ నిక్కువముగ
ననఘకశ్యపుఁడనెడుమ♦హర్షివరుని, తనయుఁడ ననంతుఁడనుపేరఁ♦దనరువాఁడ.

క. ధాత్రిఁ దలువేవ్వరు నాకున్, మాతృకకపాత్రి యఘూటీ॰ మ మెుక్కిక పని కై
యాతతవహానజ్వాలల, చేతంబడుఁ డంచు నలిగి॰ సెపియించుటయున్.

తే. అందుఁ దక్షకుఁ డనియెడు॰నహివిభుండు. శాపభయమున గి తుండయి॰జగతిఁ బ్రబల
నేనునీపాదసరసిజ॰ధ్యానరూఢి నిట్లుతపమాచరించెద॰నీశ్వరేశ. 73

తే. భక్తవత్సల నేనిటుఁ॰బాసియుంక, నొక్కతావున వసియింప॰నుత్సహింప
నీపదాంబుజయుగళసే॰వాపరత్వ, మూనియేప్రొద్దు నెమ్మది॰నుండువాఁడ

మ. నలినాక్షాయనమోఽస్తుతేభగవతే॰నానాజగద్ధాత్రి సే
ఖలహృద్దర్పతమస్సహస్రఘృణయే ॰ కైవల్యనాథాయ ని
ర్మలకారుణ్యగుణాయ ధాతృగురవే ॰ మన్దాకినీనామకై
వలినీప్రోద్భవకారణాయ యనుచున్ ॰ వాకుప్రిచ్చి కేల్మోడ్చినన్. 75

విష్ణువు శేషునియెడ నిజానుగ్రహము చూపుట.

ఆ. హరియహీనకరుణ॰నయ్యహీనకుఁ లేంద్రు, గారవించి యింపు॰గదురబలికె
వత్సనీకుభీతి॰వల దింక నాయొద్దఁ, దలఁగకెపుడు నెలమిఁదవిలియుండు. 76

క. భక్తపరాధీనుఁడనే, భక్తుల నెడఁబాసియొక్క॰పట్టున క్షణమున్
శక్తుఁడఁగాను వసింపఁగ, భక్తాధీనంబునాదు॰బ్రిదుకు కుమారా. 77

క. భుజగకులనాథనీకున్, నిజభక్తిపరుండ వీవు॰నేఁడాదిగ నిన్
సుజనహితు విడుచుటకు న, క్కజముగ నెమ్మనమునందుఁ॰గాంక్షింపఁజుమీ. 78

క. తలిమంబవగుము నాక, గ్గలము సుఖావహముగాఁగ॰గణుతింపఁగన
వ్వలనిఁ దకన్న మఱికాఁ, గలుగఁ ప్రయోజనము లేదు ॰ గద యురగేంద్రా. 79

ఆ. శైత్యసౌకుమార్య॰సౌగంధ్యములనాకు, శయ్యవగుచునీవు॰నెయ్యమమర
నధివసింప మిగుల॰నర్హుఁడ వగుదువు, భువనవిదితతేజ॰భుజగరాజ. 80

తే. అక్కజంబుగ నీపేర॰నిక్కలంకు, భూతలంబున విఖ్యాతిఁబొందఁగల ద
నంతకాసారసంజ్ఞన॰నారతంబు, సకలదోషాపహరణప్ర॰శస్తిఁగాంచి. 81

తే. అఖిలకలుషపరిపూరితుఁ♦డైనమనుజుఁ డీతటాకంబులోఁ గ్రుంకె♦నేనియంద
నంతఫలభాజనంబయి♦సంతసమున, దివ్యకైవల్యపట్టణ♦స్థితిఁ జెలంగు. 82

క. సర్పత్వము నీకెపుడుఁ బ్రసన్నత్వమె యున్నకతన♦సమధికలీలన్
సర్పపురాహ్వయమునఁ దగ, నేర్పడఁ గాఁగలదు సువ్వె♦యీ క్షేత్రమిలన్. 83

క. పేరెన్నికగా నిందొక, కారణమునఁ బొడమి నిలువఁ♦గలవాఁడఁ జుమీ
నారదుఁడనుమునివరున క, పారకృపారససమృద్ధిఁ♦బ్రత్యక్షుండై. 84

వ. అని నిఖిలగుణశ్రేయుండును భక్తపరతంత్రుండును భగవంతుండును నగు శ్రీహరి మృదుమధురగంభీరోదారవచనంబుల భుజంగపుంగవు నారాధించి యంతర్ధానంబు నొందెఁ బ్రతిదినంబు నీయుపాఖ్యానం బాకర్ణించుజనుండు జన్మబంధంబులం బాయునని చెప్పిన విని శౌనకుం డగస్త్యునకు వెండియు నిట్లనియె. 85

—: సర్పపురమందలివిష్ణుప్రతిష్ఠను గుఱించి యగస్త్యుని శౌనకుం డడుగుట. :—

ఆ. యతికులేంద్రచంద్ర♦యద్భుతంబుగ నీక, థాప్రసంగమిపుడు♦దవిలి వింటిఁ
గాని మదికిఁ దృప్తి♦గలుగకున్నది యింక, వినఁగవలయుఁ దెలుపు♦విస్తరముగ.

తే. కలశజన్మ యొకానొక♦కారణమునఁ నిచటవసియింతు ననిభుజ♦గేంద్రుఁ బలికె
నాదిపూరుషుఁడైనట్టి♦హరి యటంచు, నాడితిరిగద మీరిపు♦డద్భుతముగ,

క. ఆకారణమెట్టిది భువ, నైకధురంధరుఁడు విష్ణు♦వీశుఁడు ధరణిన్
దా కొని నారదమునిచే, నే కరణిఁ బ్రతిష్ఠఁ బొందె♦నెఱిఁగింపు దయన్. 88

—: నారదుండు బ్రహ్మసభకరుగుటను గుఱించి యగస్త్యుండు దెల్పుట. :—

సీ. అనిన శౌనకునకి♦ట్లనియె నగస్త్యుండు, సంయమీశ్వర ఫణి♦స్వామితోడ
భగవంతుఁ డాడిన♦పలుకు తథ్యంబుగ, శోభనలీల న♦చ్చోటఁ బొడమి
నారదమునిచే జ♦నార్దనుఁ డెలమిఁ బ్రతిష్ఠితుఁ డైయుండె♦దివిజులెన్న
నత్తెఱఁ గెఱిఁగింతు♦నవధరింపుము సమా, హితమనస్కుఁడవయి వితతభక్తి.

తే. సకలభువనంబులందెల్ల♦సంతతంబు, సంచరించుచునుండు సు♦జ్ఞాననిధియుఁ
బరమభాగవతాచార♦నిరతుఁడైన, నారదర్షివరుండొక్క♦నాఁడు వేడ్క. 89

సీ. కాషాయవసనరం♦గత్కటీరముతోడ, రమ్యామృదూర్ధ్వపుం♦డ్రంబుతోడ
బద్ధాక్షమాలికా♦ప్రతతవక్షముతోడ, నకుటిలదండకుం♦డికలతోడఁ
గనకవిపంచికా♦కలితహస్తముతోడఁ, బటుతరారుణజటా♦పటలితోడ
శరదిందుచంద్రికా♦సదృశగాత్రముతోడ, దంబారుకృష్ణాజి♦నంబుతోడ.
తే. మాధవానంతగోవింద♦మధునిషూద. నాచ్యుత జనార్దనోపేంద్రఁహరిశయాన
యనెడుసత్కృతివాక్యములతోడ♦నద్భుతముగఁ. గండ్రదర్శించుకోరికఁ♦దరలిచనియె.

వ. అయ్యవసరంబున.

సీ. బలరిపుప్రముఖది ♦ క్పాలకులొకవంక, నొకవంక సనకాది♦యోగివరులు
గరుడకిన్నరయక్ష♦గంధర్వులొకవంక, నొకవంకసిద్ధగు♦హ్యకకులేంద్రు
లర్కచంద్రాదిగ్ర♦హాధీశు లొకవంక,నొకవంకఁగమ్రాభ♦ప్రోత్తములును
ఖచరవిద్యాధర♦గ్రామణులొకవంక,నొకవంకవసురుద్ర♦హుతవహులును
తే.కొలువశతకోటిమార్తాండ♦విలసదమల,మణిగణస్థాపితాస్థాన♦మంటపమున
రత్నపీఠాగ్రమున నురుఁ ప్రాభవమున. హాళిఁగొలువుండె సరసీరు ♦ హాసనుండు.

వ. అట్లుగొలువున్నయన్నిలింపజ్యేష్ఠుం గొడగాంచి నమస్కరించి నారదుండుతదాజ్ఞాప్రకారంబున నర్హాసనమునం గూర్చుండి యిట్లనివినుతించె 92

సీ. జయ పితామహసర్వ♦జగదుద్భవవిధాన,జయచతుర్ముఖయోగి♦జనశరణ్య
జయ వాగ్వధూవర ♦ సకలలోకేశ్వర, జయహంసవాహన ♦ జలజగర్భ
జయ శతానంద ని ♦ శ్చలగుణాలంకార, జయసురజ్యేష్ఠ సు ♦ జ్ఞానగమ్య
జయ విరించిన వేద ♦ శాస్త్రప్రపంచజ్ఞ. జయసరోజాసన ♦ సాధువంద్య
తే. జయపురందరముఖసుధా ♦ శనవిధాన. భర్మకోటీరనిఘటిత ♦ పద్మరాగ
మణిమయూఖావళీరాజ♦ మానసూత్న, దివ్యతరపాదరాజీవ ♦ దేవదేవ.

వ. అని నుతించుచున్న సమయంబునం జతుర్ముఖుండు చతుర్వక్త్రంబులఁ బరమాద్భుతంబులైన వృత్తాంతంబులు సభాజనంబు లానందింపం జెప్ప

చుండి యంతఁబ్రసంగవశంబున లక్ష్మీమనోనాథుండైన విష్ణునసంతవైభవంబు సమధికగంభీరనాదంబున నిట్లని చెప్పఁదొడంగె. 95

నారాయణుని యుత్కృష్టత్వమును బ్రహ్మ వర్ణించుట

తే. స్రష్టయును సృజ్యుఁడును దానె ♦ జగములందు
రక్షకుఁడు రక్ష్యుఁడును దానె ♦ ప్రత్యహంబు
హర్త్రుసంహార్యులును దానె ♦ యతికృపాప
రాయణుండైన యాదినా ♦ రాయణుండు. 96

తే. అజుఁడతండె జనార్దనుఁ ♦ డతఁడె శంభుఁ
డతఁడె పురుహూతుఁడతఁడె చం ♦ ద్రార్కులతఁడె
వహ్నియాతండె సకలదే ♦ వతలు నతఁడె
విశ్వమంతయు నాతండె ♦ వేఱులేదు. 97

క. నేనును బురుహూతుఁడు నీ, శానుఁడు నిఖిలామరులును ♦ సనకాదిమహా
జ్ఞానులును విష్ణుమాయా, నూనావర్తమున మునుగు ♦చుండుదుముగదా

వ. మఱియు దేహప్రాణంబులు భిన్నంబులయ్యు నేకప్రకారంబునం గనుపట్టు దేహంబులు జడంబులు ననిత్యంబులు నవిశుద్ధంబులు నతివికారంబులునై పంచభూతంబులచేత సంవర్తితంబులగుచు నంతంబున వానియందె విలయంబునుజెందు విరుద్ధధర్మసంక్రమణంబునఁ దాదాత్మ్యవర్ణసంబునంద నర్హంబులై యుండు ప్రాణంబులు చిదానందాత్మకంబులు నిత్యంబులు శుద్ధంబులు నిర్వికారంబులు బరమాత్మైకధారకంబులునై యుండు దేహప్రాణంబులకు సంసర్గంబుగా విచిభగవంతుండైన నారాయణుండు తాదాత్మ్యబుద్ధిం బుట్టించుద దేహంబులకన్నాదులు ధారకంబులు స్రక్చందనాదులు భోగ్యంబులై యుండు. 99

తే. అంబుజాతభవాండమ ♦ ధ్యస్థులగుచ, తుర్విధప్రాణులును దెల్వి ♦ దొఱఁగి మదన
జనకమాయామహావర్త ♦ మునమునింగి. వెడలశక్తులుగాకుండ్రు ♦ వేయునేల

వ. ఆబ్రహ్మస్తంబపర్యంతంబు స్థావరజంగమాత్మకం బగుకకలజగంబుఁ బ్రకృతినిష్ఠితంబై యుండుఁ బ్రకృతిలోకంబునకుంగారణంబు బలవత్తరంబుగ

మాయాగుణత్రయానుబద్ధులును గామమోహితులును నైనసమస్తప్రాణులు
నుత్కృష్టధర్మంబగు జ్ఞానవైరాగ్యలక్షణం బెఱుంగనేరక చెడుదురు. జ్ఞాన
బును లగుసమస్తయోగులు నణిమాదిసిద్ధులగుదురు, బ్రాహ్మణులగు
యతులహంకారావృతులై చెడుదురు వేదశాస్త్రపారంగులగు ద్విజులు విద్యా
గర్వప్రతిగ్రహదోషంబుల నశింతురు మఱియుం గణితగాంధర్వకాంబ
రాభరణమణిరసప్రముఖమహైశ్వర్యగర్వంబున నుత్సాహితులును బహు
హితక్రియావిధానంబుల మంత్రివాదులును శాపదూషణపాపంబున
బ్రాహ్మణులును సత్కృత్యప్రతిగ్రహంబున సోమయాజులును లోభంబున ధని
కులును యాచ్ఞాదికంబుల దరిద్రులును నీశ్వరార్పితబుద్ధిరహితయాగాది
దానంబులం గుదాతలును బరవధూప్రతిగ్రహాది వివిధదోషంబుల సమస్త
జనులును నధర్మాచారనిరతులగుచు వర్తించి నశించి స్వర్గయమాలయాది
లోకంబులం బ్రవేశించి తత్తత్పుణ్యపాపఫలంబు లనుభవించి క్రమ్మఱ
నవనిం బ్రవేశించి క్రిమికీటకమృగఖగాదిక పాపయోనులం బ్రభవించి
మరలనశించి పునఃపునర్జననమరణాదిదుఃఖములం గృశించుచుండుదురు
జననమరణంబులకు నంతంబు లేకుండు నట్లుగాక. 101

ఆ. శివునిమీఁదనైన శ్రీరామకన్యకా. ధవునిమీఁదనైనఁ దలఁపు నిలిపి
సతినుతిప్రపూజనములసంతసిలంగఁ, జేయుఘనుఁడు ప్రకృతిఁ జెందకుండు

క. గోవిందకీర్తనము గా, రీవల్లభపూజనంబు దృఢతరభక్తిం
గావించుమనుజుఁ డొందుం, గేవలనిర్వాణపద మకిల్బిషుఁడగుచున్.

వ. అని యిట్లు సరోజాసనుండు పలుకుచున్నవిని నారదుండు దండ్రికిట్లనియె.

## నారదుండు గర్వోక్తులాడి బ్రహ్మచే శపింపఁబడుట

సీ. అభవ నీమాటతథ్యము ముజ్జగములఁ బాయక వర్తమానచరాచరంబు
లగుప్రాణు లఖిలంబు నవిశంబు విష్ణుమాయామహావర్తంబునందు ము
నుఁగు
చుండు నేనప్పురుషోత్తముమాయను, దవులక యుండితి నవిరతంబు
సని నామదిని సంశయం బొకయింతయుఁ, గలుగక వర్తింతు నెలమిమీఱ

తే. అనుచు గర్వసమన్వితం బైనమాట, నారదుం డాడుటయు శతానందుసభను
గలుగు వారందఱును నెమ్మొగములు వాంచి, యూరకుండిరి మాటాడ కోర్కి
మెఱయ.

వ. అప్పు డజుండు విహ్వలమానసుం డగుచు నారదున కిట్లనియె. 106

తే. నారదమునీంద్ర నీవంటివార లిట్టి, మాట పలుకంగ దగదు విస్మయము మీఱ
నన్య మేటికి భావమా లిన్య మిదియె కాగ దుసుమ్మ నీకు నిక్కంబుగాగ.

వ. అని పితామహుండు నారదుం బలికి నిజావాసమందిరంబునకుం జనియె
సమస్తదేవర్షివరులును యథాస్థానములకుం జనిరి నారదుండును యథా
పూర్వకంబుగా లోకసంచారతత్పరుం డై తిరుగుచుండె నని శౌనకున కగ
స్త్యుం డెఱిగించిన నతం డతనినవ్వలి కథావిధానం బెట్లని యడుగుటయును

చ. సరసగుణాలయా ప్రణత సామజరాట్పరిపాలనప్రియా
చిరకరుణామయా పతగశేఖరదివ్యహయా లసన్నయా
పరిహృత ఘోరకల్మషవిపక్షప్రచయా వినివారితామయా
హరిహయముఖ్యనిర్జరగణార్చితపాదసరోరుహద్వయా. 109

క. అంభోధికన్యకాకుచ, కుంభద్వయగంధసార కుంకుమపంకా
దంభామోదామోదిత, శుంభద్గోరంతరాళ శుభగుణశీలా. 110

సుగంధివృత్తము.

కాశహార కాశహీర కౌముదీ పయస్సుధా
కాశనిమ్న గేందు తార కాశతార తారసీ
కాశకీర్తి సుప్రకాశ కామితార్థదాయకా. 111
కేశవాచ్యుతా ప్రమేయ కృష్ణలోకనాయకా

గద్యము. ఇది శ్రీమత్కుక్కుటేశ్వరకరుణాకటాక్షనిరీక్షణసంలబ్ధ సరసకవితా
సామ్రాజ్యధురంధర ఘనయశోబంధుర కౌండిన్యసగోత్రపవిత్ర
కూచిమంచిగంగనామాత్యపుత్త్ర సకలసంస్కృతాంధ్ర
లక్షణకళా కౌశలాభిరామ తిమ్మకవిసార్వ
భౌమప్రణీతం బైనసర్పపురక్షేత్ర మాహా
త్మ్యంబను పుణ్యచరిత్రంబునందుఁ
బ్రథమాశ్వాసము.

శ్రీశారదాంబాయై నమః

# సర్వపురమాహాత్మ్యము



## ద్వితీయాశ్వాసము.

శ్రీలలనాభూలలనా
నీళా మహిళాసనాథ ♦ నిరుపమమేధా
లీలాకటాక్షవీక్షణ
పాలితనతయూథ సర్వ ♦ పత్తననాథా.

తే. అవధరింపు మగస్త్యసం ♦ యమివరుండు
శౌనకున కిట్లనియె నట్లు ♦ సకలదేశ
ములఁ జరించుచు నారద ♦ మునివరేణ్యుఁ
డురుతరామోదహృదయుఁడై ♦ యొక్కనాఁడు. 2

### నారదుండు సర్వపురము చేరుట

చ. చనిచని కాంచె సిద్ధసుర ♦ చారణయక్షభుజంగకన్యకా
జనకుచకుంభసంభృతవి ♦ శంకటసంకుమద్రైణనాభిచం
దనఘనసారసౌరభని ♦ తాంతసుగంధిసరోభిరామమున్
ధనకనకప్రకీర్ణమణి ♦ ధామము సర్వపురీలలామమున్. 3

సీ. వేదవేదాంతప్ర♦వీణవిప్రకులంబు, పరమభాగవతవి♦భ్రాజితంబు
దీపితనవరత్న♦గోపురప్రకరంబు, సరసపుణ్యాంగనా♦సంవృతంబు
పల్లవఫలపుష్ప♦బంధురోద్యానంబు, పావనానంతస♦రోవరంబు
దివ్యదేవాగార♦దేదీప్యమానంబు, భర్మనిర్మితహర్మ్య♦భాసురంబు

తే. భూరిగారుత్మతద్వార♦తోరణంబు, గురుతరానర్ఘ్యమాణిక్య♦కుట్టిమంబు
లాలితోదగ్రహరినీల♦జాలకంబు, పుణ్యనిలయంబు శ్రీసర్వ♦పురవరంబు.

వ. ఆపట్టణంబు ప్రవేశించి యందొకరాత్రి వసియించి మఱునాఁడు ప్రభాత
సమయంబున లేచి.

## నారదుం డొకకొలనియందు మునిఁగి స్త్రీయగుట

క. బృందారకముని సంధ్యా, వందన మొనరింపఁగోరి వరజలములకై
యందంద వెదకుచుండెన్, మందానందమున నంత మహిమదలిర్పన్.

తే. అతనిగర్వంబడంగింపఁ నాత్మఁదలఁచి, యచటనద్భుతచేష్టితుండైన హరిమ
నోహరంబుగనొక్క పెన్గొలనుసరగఁ, గల్పితము చేసెనాశ్చర్యకరము
గాఁగ.

వ. అది యమందమచుకుంద మందారకుంద చందన పాటలసాల హింతాలత
మాల మాలతీ పనస ఘనసార కదళీ కదంబ జంబు జంబీర పున్నాగనాగ
రంగాశ్వత్థామలక ప్రముఖానేకానోకహాకీర్ణతట తలవనాంతరాళ
సమర్ధ్వ విపులఫలకిసలయాహారలీలావిహారమాణ హారిహారీత కీరశారికా పారా
వతపరభృతప్రభృతివివిధగరుద్రథరాజరాజికూజితభ్రాజితంబును, మందానిల
సముద్ధూత వీచికాబింబు సందోహసమాకీర్ణంబును, ప్రఫుల్లహల్లక కెందీ
వరకుముద కువలయ విమలకమలాస్తోక మరందపానానందితేందిందిర
బృందమందమధుర ఝుంకారనినద మేదురంబును, హంసకారండవక్రౌంచ
బకచక్రవాకాదికోజ్జ్వల విహంగరాజివిరాజితంబును, ప్రసూనరేణుసం
రాక్కరుశాంభఃపూరసుశీతలంబును. నిరంతర దివ్యసుగంధబంధురంబును,
మత్స్యకచ్ఛపశిలీంధ్రులీకుళీరముఖాశేషాంభశ్చరకుల సంకులంబును, బాంధ
లోకశ్రమాపనోదక విమలోదకపరిపూరితంబును, సకలజనమనోహరంబు
ను నగునక్కాసారంబు గనుంగొని నారదుం డత్యంతాద్భుతస్వాంతుం
డగుచుఁ దత్తీరంబున వీణాకమండలువులువెట్టి జలావగాహనార్థంబకొ
లంకుసొచ్చి మునుంగుచుం దేలుచుఁగొంతతడవు విహరించియంత.

కొదమతుమ్మెదదిమ్ముర నదలించు పెన్నెఱుల్, కెందమ్మివిరులనేల్ కేలు
గవయు

జక్కవకవనుల్లసముఁలాడుచనుగుబ్బ, లలఁతిచీమలబారుఁ గలఁచునారు

బున్నమ రేజేని♦ నెన్ను ముద్దు మొగంబు, బగడాలనళికించు♦ తొగరుమోవి
కలువ తేకుల సౌరు♦ గెలుచు వాల్గన్నులా, బొన్న క్రొన్నన గేరు పొక్కిలి
యును

తే. జికిలిక్రొమ్ముంచుటద్దంబు♦ జెన్న పుచ్చు, తళుకు జెక్కులు మొల్ల మొగ్గల
హారంగు.

దెగడు పలుచాల్పు దన్నె♦ నగుపిఱుదులు, గలిగియబ్రింపు నెఱరాచ♦
కలికియయ్యె

తే. ఏమి సెప్పుదు నహహా♦ శ్రీకృష్ణమహిమ, యెఱిగి వాక్రువ్వ జగముల♦ నెవ్వ
డోపు.

నబ్రముగ నారదున కప్పు♦ డాడురూపు, వచ్చెన ద్దేవవిభుప్రభావంబువలన

తే. తనదుపూర్వప్రకారమం♦ తయును మఱచి, తనకు స్త్రీరూప మెపుడు
గల్గెన దెకాగ

దలచుకొనియంత దన్సర♦ స్తటము జేరె, బదియునాలేండ్ల లేముద్దుబడు
తియగుచు

—: నారదుడు స్త్రీయై సుదతి నాబరగి తనకుభర్తను వెదకికొనుట. :—

తే. దైవవశమున నల్లయ♦ తమిదలిర్ప, సుదతియను పేరుగల్గి యా♦ సుదతిదనకు
దగినపురుషుని జక్కని♦ సొగసుకాని, వెదకికొనుచు నదభ్రసమ్మదము
తోడ. 12

సీ. కరకంకణంబులు♦ గల్లుగల్లని మ్రోయ, బదములనందియల్♦ రొదయొనర్ప
గాంచికాఘంటికా♦ ఘణఘణధ్వను లొప్ప, ముత్యాలచేర్చుక్క♦ మొగి
నటింప

దాటంకమణిరుచుల్♦ తళుకుజెక్కులబర్వ గ్రొమ్ముడివీపున గునిసియాడ
గులుకుగుబ్బలు పైట♦ నెలసిపింపిసలాడ, నలతిచెమ్మట మేననంకురింప

తే. హారకేయూరకటకర♦ త్నాంగుళీయ, కారవమ్ములుతద్దయు♦ హారువుచూప
గడిదికలపంబు నెత్తావి♦ గ్రమ్ముకొనగ, వనిజరించుచుండెన♦ వ్వనజవదన.

తే. మేఘమధ్యంబునందు గ్రొ♦ మ్మెఱుగువోలె
నింపురాణింప నట జరి♦ యించుచుండె

నవ్వీధమ్మున నవ్వన ◆ జాయతాక్షి
మెలఁగుచో వేళయొకకొంత◆మించుచుండె. 14

## నికుండరాజచరిత్రము.

తే. అంతసోమాన్వయోద్భవుం◆డైనవీర, బాహుపౌత్త్రుండుసుత్రతకీర్తి◆భాహు
జాగ్ర
గణ్యపుత్త్రుండు నిస్తుల◆పుణ్యఖని ని,కుండుఁడనియెడునరపాల◆కుంజరుండు

ఉ. భానుఁ డుదగ్రతేజమున◆భావభవుండు విలాసలీల వై
శ్వానరుఁ డుగ్రరోషమున◆వాసవుఁ డాతతకీర్తి చేమహా
సేనుఁ డదభ్రవీర్యమున◆శేషుఁడు వాగ్విభవంబునన్ రమా
జాని కృపాగుణంబున ర◆సాస్థలినిస్తులశాంతి వైఖరిన్. 16

సీ. తనవినిర్మలమనో◆వనరుహంబునకుశ్రీ, రమణీవిభుఁడు మధు◆వ్రతముగాఁగ
దనకీర్తినర్తకీ◆తరుణీలలామకు, బ్రహ్మాండములురంగ◆భవనములుగఁ
దనమండలాగ్రప్ర◆తాపానలంబున,కరిరాజతతితృణో◆త్కరముగాఁగఁ
దనదానవిఖ్యాత◆ఘనఘనాఘనమున, కఖిలార్థులును జాత◆కావళులుగ

తే. నలరెరఘువరభృగువర◆నలదిలీప, సగరపురుకుత్సశిబిహరి◆శ్చంద్రనహుష
భరత శశిబిందు నిభశుభ◆ప్రాభవుండు, నయవిదుండు నికుండభూ◆నాయ
కుండు. 17

తే. అమ్మహీపతిమణితండ్రి◆యట్లప్రజలఁ, బ్రోదిసేయుచు నక్షత్త్ర◆భోగలీల
బీఠికాపట్టణంబు సం◆ప్రీతితోడ, నేపుదైవాఱనమ్మని◆నేలుచుండె. 18

సీ. దేవదేవుండు కుం◆తీమాధవస్వామి, దలఁగకేపురమున◆నిలిచియుండె
దివిజనాయకసంప్ర◆తిష్ఠితుండైకుక్కు, టేశ్వరుఁడేవీట◆నిరవుకొనియెఁ
బృథుతరాష్టాదశ◆పీఠంబులకుఁబెద్ద, పురుహూతికాంబ యే◆ప్రోలవెలసెఁ
బరమపావనమైన◆పాదగయాక్షేత్ర, మేరాజధానియం◆దేపుమీఱె

తే. సేతుకాశీప్రయాగాద్య◆శేషదివ్య, తీర్థరాజంబులట్ల ప్ర◆తిష్ఠఁగాంచె
నేమహాపట్టణంబది◆యెన్నవలరు, భువనసారంబు పీఠికా◆పురవరంబు. 19

సీ. వివిధశాస్త్రపురాణ♦వేదవేదాంతసం, విదులయి వెలసిన♦విప్రవరులు
హాయమతంగజశతాం♦గారోహణక్రియా, ప్రౌఢి గాంచిన మేటిబాహు♦జులును.
ధనధాన్యవిస్ఫూర్తి♦దానవిద్యాభ్యాస, పారీణులైనట్టి ♦ యూరుజులును
బాడి పంటలచేత ♦ భాగ్యసంపన్నులై సుస్థితినలరొందు శూద్రజనులు
తే. మఱియుఁ గొదలేనికలుములఁ♦గొఱలి వఱలు,నితరవర్ణజనంబులు♦నతితరముగఁ
గలిగి యేప్రొద్దు శుభలీలఁ♦జెలఁగుచుండు. భూరివిభవంబు పీఠికా♦పురవరంబు 20

క. ఆనగరి కధీశ్వరుఁడై, పూనిక నిష్టోపభోగ♦ములఁ దనియుచు ధా
త్రీనాథమణి సికుండుం, డానగరిపుకరణి శివి♦నలరుచు నుండెన్. 21

శరద్వర్ణనము.

శా, అంతన్ భ్రాంతసరస్సమగ్రబిసనా♦శాహారలీలాపరి
భ్రాంతానంతమరాళికానిచయసు♦శ్రావ్యస్వనాకర్ణనా
శ్రాంతాత్యంతకుతూహలోల్లసితభా♦స్వచ్ఛాలిపాలీజన
స్వాంతంబై శరదాగమంబు దనరెన్♦సర్వంసహామండలిన్. 22

సీ. విమలపయోవఖం♦డములుమింటఁ జరించె,కలమమంజరులెల్ల♦దలలువంచె
గొలఁకుల నలినముల్♦గలువలువికసించె,మదమరాళంబుల♦రొదలుమించె
వృషభముల్ అంకెలు♦వేయుచు నెదిరించె, శైవలినీతతుల్♦సన్నగించెఁ
గేకిసంఘాతంబు♦కేకలుచాలించెఁ, బూసఁగఁ దోవ్రలనురాం♦పులునశించె
తే. విలసితంబుగఁ బైరులు♦విస్తరించె, సాంద్రచంద్రాతపంబు తే♦జమువహించె
నధపులకు వెంటఁ దమిమది♦నంకురించె, జననుతము లైన యాశర♦ద్దినములందు 23

—♦ నికుండరాజు సుమతి యున్నవనంబునకరిగి వేఁటాడుట ♦ —

వ. ఆసమయంబున నొక్కనాఁడుకందర్పసుందరుండును శూరుండును శత్రువిషాదనుండును జతుర్దశవిద్యాప్రవీణుండును జతురుండును సంతతదాన కళాపారీణుండును సమగ్రలక్ష్మీశుండును సర్వాలంకారభూషితుండును సముదగ్ర

గంభీరుండును నగునిషుండన రేంద్రచంద్రుండు మృగయావిహారలంపటస్వాంతుఁ డగుచుఁ దురగఖురపుటాంచలోద్ధూతస్ఫీతధరాపరాగం బాబురుహాబంధుమండలంబు మాయంబు సేయ పత్త్యశ్వరథద్విరదసంఘాతసంఘట్టనంబుల వసుంధరాభాగంబు సంచలింపఁ బరశుగదాప్రాసతోమరభిండిపాలకరవాలప్రముఖ సాధనప్రభాజాలంబులు చూపుకలమిఱుమిట్లుగొలుప సముత్తుంగతురంగ హేషాఘోషంబులును గజబృంహితధ్వానంబులును శింజినీటంకారవిరావంబులును రథాంగనిర్భరనినాదంబులును నుద్భటభటపటల కోలాహలారావంబులును భేరీపటహకాహళనిస్వనంబులును దిగిభకర్ణపుటంబులం జెవుడుపడం జేయఁ గనకమయాందోళికారూఢుండై తరలిచని తద్వనాంతరంబు ప్రవేశించియచ్చట.

క. తమిమీఱఁ జారశీకో, త్తమతురగము నెక్కి హా ◆ దైవాఱవడిన్
దుమికించి పరువు వెట్టుచు, సముదంచితలీల వెలఁగు ◆ సమయమునందున్.

ఆ. మృగయు లడవిఁ దూఱి ◆ మిగుల గగ్గోలుగా, సారెదిఁ గూఁత లిడుచుఁ ◆ జొచ్చుటయును
మృగకులంబు బెగడి మూఁగి బయల్వెడలి భూ, కాంతమౌళిచెంత ◆ గదియుటయును.

సీ. పందులఁ జిందఱనందఱగా మోఁది, దుప్పులఁ బోనీక ◆ తునిమి వైచి
సారంగముల బీర ◆ మారంగ నుగ్గాడి, శశములఁ బసచెడ ◆ సమయఁగొట్టి
కడఁతులనుమ్మడిఁ ◆ గడువడిఁ బొరిగొని, యేదులబలితంపు ◆ టేపు మాపి
తఱిమి వెల్లునఁగొండ ◆ గొఱియలఁ జక్కాడి, మనుఁబోతులను సద ◆ మదము సేసి

తే. కన్నె లేళ్ళు నెమిళ్ళును ◆ గారుకోళ్ళుఁ, బోలుగలుఁ గౌఁజులాదియా ◆ పులుఁగుగముల
మేటరిగఁ జంపెబరిగొని ◆ వేఁటలాడి, చిత్తమిగురొత్త నారాజ ◆ శేఖరుండు.

ఉ. కొందఱు లేళ్ళ దుప్పులను ◆ గొందఱు కొందఱు మన్నుఁబిళ్ళులం
గొందఱు భల్లుకంబులను ◆ గొందఱు బెబ్బులులన్ సివంగులం
గొందఱు కొండఱెడ్డులను ◆ గొందఱు పందుల నేనుపందులం
గొందఱమందశౌర్యమునఁ ◆ గూల్చిరి బంట్లు కడంక మీఱఁగన్. 28

క. కందేళ్ళఁ గొండగొఱియలఁ, బందుల దుప్పులను లేడిపదువుల నిర్గం
జిందఱవందఱగ శుని, బృందంబులు గఱచిచంపె బెల్లడలంగన్. 29

క. సేనాధిపు లాకకొందఱు, శ్యేనంబులవిడిచి రాజసింహుఁడు మెచ్చన్
నానావిహగోత్కరముల, సేనగఁ బరిమార్చి యార్చి చెఁగిరినెమ్మిన్. 30

— నికుండరాజు వనిం జనుచు సుదతింగని ఖిన్నించుట. —

సీ. అంతట మృగయావిహారంబుఁ జాలించి, వసుధాతలేంద్రుండు వలను మీఱఁ
దప్తచామీకరోద్యత్పరిష్కారస, మున్నతమేరుశృంగోపమంబు
వజ్రగోమేధిక వైడూర్యమరకత, హరినీలపుష్యరాగాబ్జరాగ
మౌక్తికప్రముఖాచ్ఛమణిగణసమలంకృ, తము నగుఘనతురంగమును డిగ్గి

తే. సూర్యసమతేజులును మహాశూరులనిన, వేగులును దివ్యభూషణాన్వితులునైన
వీరపురుషులతోఁ గూడి విపినవీథి, నెలమి దైవాఱ నందంబు మెలఁగుచుండె

సీ. హారీతశుకశారికారవాకాంతంబు, పరభృతకూజితభ్రాజితంబు
సరసగానకళానిశభ్రమద్భ్రమరంబు, ప్రమదనృత్యన్మత్తబర్హిణంబు
నికటసరోహంసనిస్వనాకీర్ణంబు, సాంద్రపుష్పపరాగసంకులంబు
ఫలభారకుసుమస్తబకలసద్భూజంబు, మృదులమరందఝరీపరీత

తే. మతితరామోదమేదురాత్యంతశీత, లానిలకిశోరవారసమావృతంబు
నైనయక్కాననంబు భూజానికపుడు, మోదమునుగూర్చె గడితంపు సేద
దీర్చె. 32

వ. అట్లు సుఖావహంబగు నవ్వనంబున విహరించుచుం జనిచని యొక్కచోట

మ. కనియెన్ భూపకుమారమాళి యొకరాకాచంద్రబింబాననం
గనకాంగిం గలకంఠకంఠిఁ గలికిం గస్తూరికాసౌరభం
గనదంభోజదళోపమాననయనన్ గంధేభకుంభస్థలిన్
ఘనసారాచ్ఛదరస్మితన్ ఘనకచం గాంతాజనగ్రామణిన్. 34

క. కనిమెల్లన డాయంజని, వనజాయతనేత్రరూప వైభవములకున్
మనమున నద్భుత మొందుచు, జననాయకమౌళి దాని సారునుతించెన్.

క. అద్దిర దీనియొయ్యారం, బద్ధివిజవధూమణులకు నహికులపుజగా
ముద్దియలకు మానిసినెలఁ, ముద్దులగుమ్మకుఁ గలదె ముల్లోకములన్.

చ. బలురతనంపుగోవ యని పల్కినఁ దావులుసిల్కుచుండె ను
న్నళుకుఁబసిండిబొమ్మయని కాంచినఁ బల్కులునేర్చియుండెఁ గ్రొం
దొలకరిమించుఁదీవయని తోఁచిన నిల్కడగల్గియుండె నీ
కలికికడిందిజవ్వనము కన్నులపండువయయ్యె నద్దిరా. 37

సీ. చిన్నారిజాబిల్లి కన్నెమామిడిగున్న, మరునివాల్దూపుచే మంతిబంతి
తళుకుబంగరుబొమ్మ తొలకరిక్రొమ్మించు, కులుకుమిటారి వెన్నెలకొటారు
తెలిముత్తియపుగోవ వెలలేనిమానికం. బలఁతివెన్నెలనిగ్గు పల్కుఁజిల్క
కపురంపుబరణి చొక్కపునిల్వుటద్దంబు, తావిగేదగిపువ్వు తమ్మికొలను

తే. నాఁగఁగానబాలనియ్యేల నాఁగబాగు, నాగగంధర్వయక్షకిన్నరకలింప
గరుడఖచరాప్సరస్సిద్ధ కామినులకుఁ గలదెపరికింప మూఁడులోకముల
యందు

సీ. అలులు లేనెలవింట్లు తిలపుష్పముత్పల, దళములు మగఱాలు తమ్మికెంపు
ముకురముల్ శ్రీకారములుదరంబుబిసంబు,లబ్జముల్ జక్కవలాకసంబు
భుజగంబు గరఁగలు పొన్నపూవచలంబు, పులినంబు లశ్వత్థదళమనంటి
కంబముల్ కాహళుల్ కచ్ఛపంబులు, తార,కలుపల్లవంబులు కాంచనంబు

తే. కప్పురముగూర్చిసరసిజ గర్భుఁడిట్లు, చేసెఁగాఁబోలునిమ్ముద్దుఁజిగురుబోడి
నట్లుగాకున్న నీభువ నైకమోహ,నాద్భుతాకార వైభవం బవలఁగలదె.

క. బంగారుబొమ్మతెలుఁగునఁ, బొంగారుచు మదికినాసఁ బొదలించెడు నీ
శృంగారవతివిలాసం, బంగజుపట్టంపురాణి కైనంగలదే. 40

సీ. కరికుంభములతోడఁ గలహంబుగావించి, మారేటిపండ్లతో మచ్చరించి
క్రొవ్విరిచెండ్లతోఁ గొదుకకవాదించి,పసిఁడికుండలతోడఁ బ్రతిఘటించి
గిరిశృంగములతోడ మరలకయెదిరించి,బలుబొంగరాలతోఁ బంతగించి
గజనిమ్మపండ్లతోఁ గవగొనిజగడించి, తమ్మిమొగ్గలతోడఁ దారసించి

తే. ముద్దుజక్కవకవలతో, మొగ్గరించి, పొన్నకాయలతోఁబగఁబూండ్రగించి
యతితరం బైనచెలువున నలరెనౌర. యబ్బురంబుగ దీనిచన్నుబ్బుదోయి.

సీ. కనకకుంభములెంత, కాఁకచేఁబెరిఁగిన, దరము లేతెఱఁగున, మొరయుచున్నఁ
గరటికే లెంతవఁకరగామెలంగినఁ, గడుఁజక్కలములెంతయుడుకుచున్న
భుజగంబు లేరీతిఁ బొరయూనిపొరలిన, మృగకులాధిపుఁడెంత, మొగిరిపడిన
గలికి తేం ట్లెంతెఱుఁగుం, గారంబుచూపిన, మీలెంతపొలసెక్కి మిట్టిపడిన

తే. నౌర యిక్కొమ్మకుచకంధ రోరుకర్ణ
రోమవల్లివలగ్నశ్రో ణీజనయన
ముల నెసంగొని యొక్కింత గెలువఁగలవె
మరునికొఱింబువ్వములికి యయ్యరిదికలికి. 42

వ. అని కొనియాడుచున్నసమయంబున. 43

సుదతి నికుండరాజుం గని వలచి వర్ణించుట

క. రాజానన గనుఁగొనియె వి, రాజన్మణిభూషణాభిరామశరీరున్
రాజకుమారున్ జితసుర, రాజకుమారేందు రాజరాజకుమారున్. 44

క. వనజాతనయన యటువలెఁ, గనుఁగొని యెనలేనివలపుగడలుకొనఁగ నా
తనిచెలువమునకుఁ దద్దయుఁ, దనమదిలో నద్భుతంబు దనరారంగన్.

క. సంతుఁడొమఘవసుంతుండొవ, సంతుండొనలకూబరుండొజలజాహితుడో
సంతసమయ్యె నహో యి. కాంతాజనమోహనాంగుఁగనుఁగొన్నంతన్.

సీ. దరములఁ దఱుమునిద్దంపుఁగుత్తుక వాఁడు, హరినీలముల నేలుకురులవాఁడు
గజతుండములమించు భుజదండములవాఁడు గురుకవాటముఁబోలు నురమువాఁడు
చిగురుటాకుల నెన్నుతొగరువాతెరవాఁడు, గబ్బిసింగము గెల్చుకౌనువాఁడు
తమ్మితేకఁ బొటఁజిమ్మకన్గవవాఁడు, మినుకుబంగరుఁగేరు మేనివాఁడు

తే. జాతిమగతాలఁ దెగడుపల్♦చాల్పువాఁడు, చికిలిక్రొమ్మించుటద్దంబుఁ♦జిన్నవుచ్చు
చెక్కుఁగనవాఁడు బళిరయీ♦క్షితివరుండ, టంచునాతనిసోయగం♦బెంచుచుండె.

క. అపు డానృపతనయుం డిప్పై, జపలేక్షణపై మరుండు♦సమసుమశరముల్
శపథంబూని పారింబారి, విపరీతముగాఁగ నేసి♦వివశులఁ జేసెన్. 48

## నికుండరాజు సుదతిం దనపురికిఁ గొనిపోవుట.

వ. అప్పు డప్పుడమిఱేఁ డచ్చేడియం గనుంగొని యిట్లనియె. 49

ఉ. ఎక్కడిదాన వీవు కమ♦లేక్షణ నీవు వసించునుక్కప
ట్టెక్కడ నీమనోరమణుఁ♦డెవ్వఁడు నీతలిదండ్రులెవ్వ రీ
చక్కనిజాళువాపసిఁడి♦చాయఁ గేరెడుమేను గందఁగా
నొక్కతెవిక్కడం దిరుగు♦చుండఁగఁ గారణమేమి చెప్పుమా. 50

సీ. అనిన నచ్చాన య♦య్యంగనారాచసం, తప్తయునాచ్ఛాదితస్వదేహ
లతికయునిర్భర♦లజ్జానిమీలిత, నయనయు నై మహీ♦నాథుసారెఁ
గడగంటిచూపులఁ♦గనుఁగొంచునొకతరు, పార్శ్వంబునందుండి♦పాదపంబు
కొనగోళ్ల వ్రాయించు♦కొనుచునొదలవాంచి, యొక్కింత మాటాడ♦నూరకుండె

తే. వీతరాగుండు తత్త్వసం♦విదుఁడునిస్పృహుండు నగునారదుం డప్పు♦డోలిరాగ
కామలజ్జాధికత్వముల్♦గలిగియుండె, నహహా దైవకృతం బెన్న♦నద్భుతంబు 51

వ. అని యగస్త్యుండు వెండియు శౌనకున కిట్లనియె నట్లయ్యాగంతుకాంగనా రత్నంబు మదనవిహ్వలమానస యగుటెఱింగి తానును మదనావిష్టుండై నృపాలుండు దానికిట్లనియె 52

తే. వనజముఖి నీవుకన్యక♦వనుచుమదిని
దోఁచుచున్నది చూడన♦ద్భుతమునీదు
రూప మిట నన్వరింపు మా♦రూఢవాంఛ
సఫల మగుఁజుమ్మీ నీయొల♦జవ్వనంబు. 53

సీ. కలహంసగామిని♦కరటికుంభస్తని, కర్పూరదరహాస ♦ కంబుకంఠి
కలకంఠకలవాణి♦కాహళికాజంఘ, కహ్లారదళపాణి♦కమలవదన
కాసారనిభనాభి♦కంఠీరవవలగ్న, కనకకోరకనాస♦కైరవాక్షి
కస్తూరికాగంధి♦కచ్ఛపచరణాగ్ర, కార్ముకభ్రూవల్లి♦కాంచనాంగి
తే. కదళికాస్తంభరుచిరోరు♦కాండయుగళ, కల్పభూజాతనవలతా♦కలితబాహ
కాలజీమూతనీకాశ♦ఘనశిరోజ, కామినీమణి ననుఁ బ్రేమఁ♦గవయుమిపుడు
క. కొమ్మా నెమ్మది నాతో, రమ్మా మాపురికి సకల♦రాజ్యంబును నీ
సొమ్ముగఁ జేసెద ననుఁ జే, కొమ్మా మరుకేలి నేలు♦కొమ్మా నెమ్మిన్. 55
తే. అనుడు నభ్భూమివరుమాట♦లాలకించి
మెత్తఁబొటూని యన్నుల♦మిన్న కన్ను
సన్నల నలంతినవ్వుల ♦ నున్న తెఱఁగు
వన్నె దైవాఱ నెఱిఁగించి♦మిన్నకుండె. 56
వ. అప్పు డమ్మహీతలవల్లభుండు దానికరంబు పట్టుకొని సుఖాసనంబునం గూర్చుండంజేసి యమందానందకందళితహృదయారవిందుం డగుచు వరూథినీపరివృతుండై దివ్యతూర్యఘోషంబులు సెలంగ నిజపట్టణంబు ప్రవేశించి

**నికుండుఁడు సుదతితో నిష్టోపభోగము లనుభవించుట.**

తే. అంత నంతఃపురంబున♦కరిగి దివ్య
మందిరంబున నవ్వధూ♦మణిని నిలిపి
యిందుముఖిఁ గూడుకొన నెపు♦డెప్పుడంచు
నురతరామోదహృదయుఁడై♦యుండె నంత. 58
సీ. తరణిపశ్చిమసము♦ద్రప్రాంతమునఁ గ్రుంకె, గడితంపుసాంధ్యరా♦గంబు పర్వెఁ
గటికిచీఁకటులు ది♦క్తటముల గిఱికొనెఁ, దారలంబరవీథి♦దళముకొనియెఁ
గొలఁకులఁదొగలును♦గలువలు వికసించె, జలజాతవిసరముల్ ♦ దలలు వాంచెఁ
గుముదబంధుఁడు తూర్పు♦గుబ్బలి నుదయించెఁ, గోకదంపతులార్తిఁ గూరి పఱచెఁ

తే. తెలఁగి బలితంపుఁబండు వె♦న్నెలలు గాసె. విటవిటీజను లెనలేని♦వేడ్కఁ
తోడఁ
దవిలి విహరింపఁ జాగి రు♦ద్దామలీల, నఖిలజంతుసుఖావహం♦బయ్యె నపుడు

సీ. పవడంపుఁగోళ్ల చ♦ప్పరపుమంచము హంస, తూలికనించిన♦పూలపఱుపు
పక్కదిండ్లుఁ దిపహాం♦బట్టుతలాడ మా, నికపుఁగీల్బొమ్మలు♦నిలువుటద్ద
ములు తావిసురటీలు♦ మొకమాలుచందువా, మేలిముత్యాలజా♦లీలు పసిఁడి
దివ్వెగంబములు క్రొం♦జవ్వాజివంకిణీ, లడపంబు గందంబు♦గుడికలగరు

తే. కరవటంబులు కస్తురి♦బరణి తమ్మ
పడగ యత్తరుకుప్పెలు♦పైఁడిగద్ద
పీటికాపేటికలును బ♦న్నీటిగిండ్లుఁ
గలిగి వెలుఁగొందు కేళికా♦గారమునను. 60

క. కాంతారత్నముతో భూ, కాంతాగ్రేసరుఁడు ప్రేమ♦గడలుకొనంగాఁ
గంతుక్రీడావైభవ, సంతుష్టస్వాంతుఁ డగుచు♦సరవిఁ జెలంగెన్. 61

వ. మఱియును. 62

తే. రత్నశయ్యావితానవి♦రాజమాన
మందిరంబుల మణికుట్టి♦మస్థలములఁ
బుష్పవనములఁ బ్రాసాద♦ములఁ గడఁక
నువిదయును దానుఁ గ్రీడించు ♦ చున్నయంత. 63

క. ఆతేఁడుఁ జెలియుఁ గూరిమి, మీఱఁగ సుఖలీల నట్లు♦ మెలఁగఁగ వరుసన్
నాలుగురుసుతులు పుట్టిరి, తాఱనిగడితంపుఁగడిమిఁ♦ దనరెడుబలిమిన్.

## సుదతిమగఁడును గొడుకులును యుద్ధములోఁ జచ్చుట

వ. వారందఱు నతితరసత్త్వసంపన్నులు నఖండవీరపరాక్రములు నపరిమిత
తేజోపరాజితులు నభినవయౌవనారంభులు నశేషశస్త్రవిద్యావిశారదులు
నై ప్రవర్తించుచున్న సమయంబున నొక్కనాఁడు. 65

సీ. అపరాబ్ధితీరంబు♦ నందురిపుంజయుఁ, డనురాజు దనరు న♦న్వర్థనామ
కుఁడు తదాత్మజులు ము♦గ్గురు పరంతపవరా, స్కందులు పరవిశో♦షకుఁ
డనంగ

వెలయుదు రమ్మహా♦వీరవర్యులు ప్రాక్ప, యోధిజగీషఁ జ♦మూరుగణ స
మేతులై వచ్చి స♦మీపధాత్రీభాగ, మునదం దువిడియుంచి♦ మొనయుటయుని

తే. కుండనరపతి నిజపుత్త్రి♦కులును దాను, బేర్మిఁ జతురంగబలసము♦ పేతుఁ డగుచుఁ
దరలి మొనకట్టి ఘోరయు♦ద్ధంబు చేసె, నప్పు డుభయబలంబులు♦ ననికిఁ దొడరి

క. పరశు గదా పట్టిస ము, ద్గర తోమర భిందిపాల ♦ కౌక్షేయ శర
చ్ఛురికాదిసాధనంబులఁ, గరమరుదుగ భటులు దుమురు ♦ గావించి రొగిన్.

క. పృథుబలసంయుతులు జగ,త్కథితమహాయశులు ఘోరఁ గర్వో♦ద్ధతులుం
బ్రథనజయదర్పితులు నగు, రథికులు పోరాడి రధిక♦ రభసం బెసఁగన్. 68

తే. చిత్రవైఖరి నిశితకౌ♦క్షేయకములు, పెటికిజవఘోటకంబులఁ♦ బఱపి బిట్టు
నఱకులాడిరి రాహుతు♦లుఱకనిబిడ, రక్తధారాప్రవాహంబు♦ రవడిఁ బర్వ

క. గిరులును గిరులును దాఁకు, కరణిన్ మదవారణములఁ♦ గదనంబునకుం
బురికొల్పి వేటులాడిరి, కరివాహకు లపుడు ఖర్వ♦ గర్వోద్ధతులై. 70

వ. మఱియుం దురగఖురపుటాంచలోద్ధూతస్ఫీతధరాపరాగరింఛోళిచ్ఛాదితా
రుణాంశుమండలం బగునప్పుడనంబు భూరిభేరీపటహనిస్సాణంకాహళార
వంబువలనను వీరభటోత్కటసింహనాదంబువలనను నిష్ఠురధనుష్టంకారం
బువలనను మదోన్నిద్రభద్రదంతావళ బృంహితంబువలనను నసంఖ్య
శంఖనాదంబు సముత్తుంగతురంగ హేషారవంబువలనను నసంఖ్య శంఖ
నాదంబువలనను సభంగశతాంగనిర్ఘోషంబువలనను గ్రిందుకొని రోదో
తరాళంబు బధిరీకృతంబైయుండె నందు ఘోరంబుగఁ బోరొనరించి కరితు
రగవీరభటనికాయంబులు కాయంబులం బాసి పడియున్న సంగరాంగణం
బుపుష్పిత పలాశారణ్యంబు తెఱంగునం బొలిచె రక్తధారాప్రవాహంబు
లుప్పొంగి యంబునిధికిం జాగి పాఱెనప్పుడు, 71

తే. రాజు లెదిరించి ఘనసమ♦ రాజిరమున
నంపఱును మ్రగ్గుటయు నికుం♦ డాధిపతియుఁ
దారసిలి బిట్టు ఘోరయు♦ ద్ధంబు చేసి
కొడుకుగుజ్జులతోఁ గూడి ♦ పుడమిఁ గూలె. 72

—: చచ్చినమగనినిగుఱించియుఁ గొడుకులగుఱించియు సుదతి యేడ్చుట :—

ఉ. అంత నికుఁడమానవధ ♦ రాగ్రిణిచేడియ తత్ప్రకార మా
ద్యంతము వీనుల న్విని ర ♦ యంబున నాహవభూమి కెంతయు
న్వాంతదలిర్పనేఁగి కదఁ నస్థలిఁ ద్రెళ్లినప్రాణనాయకుర్
బంతిగఁ గూలియున్నసుత ♦ వర్గముఁగన్గొని శోకమగ్నయై. 73

క. హా నాథ హా మనోహర, హా సిరుషమధర్మశీల ♦ యమితవిభోగా
హా నరపాలశిఖామణి, దీనునిక్రియ నిట్లు ద్రెళ్లి ♦ తే కదనోర్విన్. 74

తే. అమలమణిమయభర్మహ ♦ ర్మ్యాంతరమునఁ, దతమృదులహంసతూలికా ♦ తల్పమున సు
ఖించునీయొడలీరణ ♦ క్షితిని బొరలు, చున్నదిపుడేమి సేయుదుఁ ♦ జెన్నుదతి.గి

వ. అని కుమారవర్గంబుఁగనుంగొని పయింబడి ముంగురులు సెదరఁ గరంబుల
నొదలమోఁదుకొనుచు నెలుంగెత్తి హా బిడ్డలారా యిట్టి ఘోరదురవస్థ
బొందితిరేయని వెక్కి వెక్కి యేడ్చుచుఁ బుడమింబడి పొరలాడుచు నుస్సు
రనుచు నుమ్మలించుచు సొమ్మగొనుచు ధూళిధూసరశరీరయై పెద్దయుం
దడవు దుఃఖించి బడలి యడలుచు క్షుత్పిపాసాపరవశయై యేమియుం
దోఁపక వనంబునఁ దిమ్మరుచున్నసమయంబున. 76

—: సుదతి యాఁకలిగొని మామిడిపండు గోయంబూనిన
నది యెట్లును నందకుండుట. :—

తే. సౌకుమార్యంబుఁ దేజంబు ♦ సౌష్ఠవంబు, సౌరభంబునుగల్గియా ♦ శ్చర్యలీల
నలరునొకచూతఫలమందుఁ ♦ గలుగఁ జేసె, హరి యదియు నట్టులాకటఁ ♦ దిరిగితిరిగి.

క. చేరువ నమ్మామిడిపం, డాహారార్థిగఁ గొమ్మయందు ♦ నందినయట్టులే
తోరముగఁ గానిపించినఁ, గోరిక ♦ జేసాఁచి యందుఁ ♦ గొనబోవుటయున్.

తే. ఫల మొకించుక యెడఁ గనం ♦ బడికరమున, కందకుండిన వే నిక్కి ♦ యవ్వధూటి
కోర్కినప్పుడు వెండియుఁ ♦ గోయఁబోవ, నటులె యెడఁజూపి కేలికినందదయ్యె.

వ. అప్పు డప్పొలఁతి నితాంతజఠరానలసంతప్తసకలావయవయగుచు సమీపంబునం బడియున్నపుత్త్రికు నొక్కనిం దెచ్చివైచి యెక్కయందుకొనం బోయినఁ దత్ఫలంబందక యంతరంబుగ లిగియుండెనట్లుక్రమక్రమంబునఁ బుత్త్రికతంబు సోపానపద్ధతిఁగావించి కోయంబోవుచున్ననది యెప్పటియట్ల యందకున్న నత్యంతదీనాననయై కన్నులనశ్రుకణంబు లురల నేమియుం దోఁపక చీకాకుపడి ఫలంబెగదిగంజూచుచున్నసమయంబున. 80

—: విష్ణువు వృద్ధవిప్రుఁడైవచ్చి సుదతికి మేలుచేసి యంతర్హితుండగుట :—

సీ. చినిఁగినసీరాకవి♦ చిన్నదోవతియును, దట్టంపుఁ దెలిజన్ని♦ దములగుంపు
రదనహీనవిశాల♦ వదనగహ్వరమును, రహిమించుదండంబు♦రాగిచెంబు
దళముగా నరసిన♦ తలయుగడ్డంబును, జెప్పులుదావళి♦దుప్పటియును
మసతలఁ దేఱుచా♦మనిచాయనెమ్మేను, మందయానముజప మాలికయును
తే. గోనబుమీఁదెఱుఁగోపిచం♦ దనమ్మృదూర్ధ్వ, పుండ్రమునుగల్గి యప్పుడు♦ భూసురోత్త
మాకృతిధరించి చెచ్చెర♦ నచ్చెరువుగ, వచ్చెనచ్చటికిందిరా♦వల్లభుండు.
క. చనుదెంచి యశ్రుముఖయును,ఘనశోకాన్వితయు క్షుద్వి♦కారార్తయునై
వనిఁ దిమ్మరుననమ్మానినిఁ, గనియావృద్ధద్విజుండు♦కరుణం బలికెన్. 82
క. ఏమిటికేడ్చెద వివ్వన, భూమిం దిమ్మరుచు ముగుద♦ పొలఁతీ మూలం
బేమి యిటులార్తినడలఁగ, నీమదిఁ గలవగపు తెలుఁగు♦ నిక్కము చెపుమా.
తే. అనుడుసతిపల్కె నీవెవం♦డరుగఁగలవొ, పొమ్ము నాతోడ నీకేలభూసు రేంద్ర
యని తిరస్కారముగవచిం♦చిన నతండు, హితవచోరూఢి వెండియు♦ నిట్టు లనియె.
తే. వనిత యిటులొక్క తెవ్వనీవు♦ వనములోన, నలమటించుచుఁ దిరుగుట♦ యరసిచూచి
తెలిసికొనిపోవుటుచితరీ♦తిగఁ దలంచి, వచ్చితినెఱుంగఁ జెప్పు నీవర్తనంబు.

సీ. అనవుడు నచ్చాన♦ యతనికిట్లనిపల్కె, విను భూసురేంద్ర నా♦విన్నపంబు
సూర్యోదయమాన తే♦జోనిధిమైనని, కుండధాత్రీనాథ♦ కుంజరునకు
భార్యనై బహుభోగ♦ భాగ్యంబులారూఢి, ననుభవించుచుమనో♦జాకృతు
లును
శస్త్రాస్త్రవిద్యావి♦ శారదులగునార్యు, రాత్మజులనుగాంచి♦యతితరప్ర

తే. హర్షమునఁగ్రాలుచోఁ బు♦ డాహవాంగ
ణమున మగఁడును గొడుకులు♦ విమతవరుల
చేత హతులైనఁ దద్వియో♦ గాతతార్తి
దుఃఖమున నిందుఁదిరిగెద♦ దొసఁగులెసఁగ. 86

తే. అంతకంటెను ఘనతరం♦బగు క్షుధార్తిఁ, దివిరివని యెల్ల నెమకుచుఁ♦ దిరిగితిరిగి
యక్కజంబుగఁ గొమ్మపై♦నొక్కమావి, పండుగనుఁగొంటిఁగన్నుల♦పండు
వగను.

క. ఆపండు గోయఁబోయిన, నేపగిదిన్ దొరకకున్న ♦ నెడయొదవ నిసం
తాపమున బడలుచుండితిఁ, దాపసవర నాయవస్థ♦ దైవంబెఱుఁగున్. 88

వ. అనిన నాద్విజపుంగవుం డంగనామణి కిట్లనియె 89

తే. పతితనూజవియోగార్తి♦బడలుచుండి, యతితరంబైన క్షుద్బాధ♦నడలుచుండి
యశుదితోనుండి పండుగో♦యంగఁ జనిన, నబ్బునే వేల యిత్తెఱ♦గర్హ
మగునె.

తే. సరసికేతెంచి యందుఁ♦స్నానమాడి, నిర్మలస్వాంతవైయున్న♦నీకునపుడె
సకలదుఃఖాపహారియౌ♦సత్ఫలంబు, కరతలాగతమగుఁ జుమ్మ♦కమలవదన.

వ. అనిన నమ్మగువ యిట్లనియె. 91

క. దీనజనావన కరుణాం,భోనిధి నాతండ్రినీకుఁ♦ బుత్త్రిని నన్నీ
మానని యాఁకట బడలం, గానీయక వేగప్రోది♦ గావింపఁగదే. 93

తే. అనఘ స్నానంబువలన న♦య్యబ్బురంపు, ఫలము చేతికి నెట్లు రాఁ♦గలదు పుణ్య
సరసి యెచ్చోటనున్నది♦ సరగ నాకుఁ దెలుపవేయని మ్రొక్కి ప్రా♦ర్థించు
టయును.

ఆ. బ్రాహ్మణుండు పలికెఁ • బరమదయాళుఁడై, మునుగుదయనతిదూర • మునసమగ్ర
నిర్మలోదకములఁ • నెరయుచు నొకకమ, లాకరంబు లీలఁ • నలరుచుండు.

తే. కుముద కహ్లార కువలయ • కోకనద స, రోరుహేందీవరాకీర్ణ • మై రణన్మ
దాళిసంకీర్ణమై క్రౌంచ • హంసకోక, సంకులంబయి నెటినక్కొ • లంకుదనరు

సీ. కుంద చందన పిచు • మంద వందక వట, మందారతిందుక • సిందువార
గాల వాంకోల త • క్కోలతమాలహిం, తాల తాళ రసాల • సాలతూల
కురువక మరువక • సరళ క్రికర పుర, కరవీర ఖదిరాభ్ర • కాకరీర
నారంగ లికుచ ఖ • ర్జూర జంబీర హ, రీతకీ • కేతకీమాతులుంగ

తే. పనస ఘనసార కదళికా • ప్రముఖవివిధ, ఫలకుసుమగుచ్ఛకిసలయ • భరనమత్స
కృష్టభూజాతజాతప్ర • కీర్ణమగుచు, వఱలుఁ దత్తీరమున నొక్క • వనము తరుణి.

మ. సరసీనిర్మలనీరబిందుకణముల్ • సమ్యగ్గతిం బూని వి
స్ఫురదారామలతాంతసౌరభరజః • పుంజంబుఁ గైకొంచు ని
ర్భరమందానిలశాబకప్రకరముల్ • పల్మాఱు నక్కోనలోఁ
దిరుగుం బాంధజనశ్రమాపహరణో • ద్వృత్తిం బ్రకాశించుచున్. 98

తే. తరుణి నీవచ్చటికి నేఁగి • తత్తటాక, నీరములఁ స్నాన మొనరింప • నీకుఘనము
చేతికబ్బును బొమ్మంచుఁ బ్రీతిఁ జెప్పి, యంత నంతర్హితుండయ్యె • నాద్విజుండు. 99

వ. అని కుంభసంభవుండు శౌనకమునీంద్రునకుం జెప్పిన నతం డతని నవ్వలి
కథావిధానం బెట్లని యడుగుటయును. 100

శా. పారావారవిహార హార హిమరు • క్స్ఫాటీర డిండీరమం
దార క్షీర తుషారపారదమరు • ద్గంధేభ తారాసుధా
పూరేందూపల హీరసార శరదం • భోదాభ్రగంగాసదృ
గ్గౌరస్ఫారయశః ప్రసారహితసం • ఖ్యావత్కులోద్ధారకా. 101

క. శంఖార్బుదసంఖ్యాహిత, పుంఖప్రాణాపహరణ • భూరిరణాంచ
చ్ఛృంఖగదాచక్రాయుధ, కంఖాణీకృతవరిష్ఠ • గరుడశ్రేష్ఠా. 102

మాలిని. కథితశుభచరిత్రా ♦ కంజమిత్రాబ్జనేత్రా
మథితఖలసమాజా ♦ మండితాఖండతేజా
పృథులగుణవిహారా ♦ కృత్తమత్తారివీరా
ప్రథనవిగతశంకా ♦ పక్షిరాజోజ్జ్వలాంకా. 103

గద్యము. ఇది శ్రీమత్కుక్కుటేశ్వర కరుణాకటాక్షనిరీక్షణ సంలబ్ధసరసకవితా
సామ్రాజ్య ధురంధర ఘనయశోబంధుర కౌండిన్యసగోత్రపవిత్ర కూచి
మంచి గంగనామాత్యపుత్త్ర సకల సంస్కృతాంధ్రలక్షణ కళాకౌశలాభి
రామ తిమ్మకవిసార్వభౌమ ప్రణీతం బైనసర్పపురక్షేత్ర
మహాత్మ్యం బనుపుణ్య చరిత్రంబునందు
ద్వితీయాశ్వాసము.



శ్రీశారదామ్బాయైనమః

# సర్వపురమాహాత్మ్యము



## తృతీయాశ్వాసము.

శ్రీ రుచిరగుణాభరణా
నారదమునివినుతచరణ ♦ నతజనశరణా
ఘోరాంహస్సంహరణా
భూరిజగద్భరణ సర్వ ♦ పురవరశరణా.

వ. అవధరింపుము శౌనకమహామునీంద్రుండిట్లని చెప్పందొడంగె నట్లయ్యాగంతుకాంగనారత్నంబు విప్రవాక్యప్రకారంబున నక్కాసార తీరంబు చేరి తజ్జలంబుల నవగాహనంబుచేసి. 2

—: స్త్రీరూపమును విడిచి నారదుండు నిజపూర్వవృత్తముల నెన్నుట. :—

క. తటిదుపమానజటావలి, పటికపుజపమాల కరవి ♦ పంచియు ధవళో
త్కటతనువుఁ గలిగిమఱి యె, ప్పటినారదమునియ యగుచుఁ ♦ బటుగతి
నిలిచెన్. 3

తే. జలధిలోపల వెడలిన ♦ శశి యుఁబోలె, నిలిచి యత్యద్భుతంబాత్మ ♦ నివ్వటిల్ల
స్త్రీత్వసంపత్సుతాదివి ♦ స్తీర్ణపూర్వ, వర్తనంబెల్ల స్వప్నక ♦ ల్పముగఁ
దలఁచె 4

ఆ. తలఁచికొలను వెడలి ♦ తత్తటాంతికవన, భూమి నొక్కపుష్ప ♦ భూరుహంబు
క్రిందఁగూరుచుండి ♦ సందేహవివశిత, స్వాంతుఁ డగుచు మఱియు ♦ నాత్మ
లోన. 5

ఆ ఏమియద్భుతం బి ♦ దేమి యాశ్చర్య మి, దేమివిస్మయం బి ♦ దేమిచిత్ర
మేమిచోద్యమిది య ♦ హోమును పెన్నఁడు, విననికనసదొడ్డ ♦ వింతవుట్టె. 6

సీ. కలఁగంటిఁ గాఁబోలు ♦ గణుతించి చూచినఁ, గల యనిద్రిన కెట్లు ♦ గలుగ
నేర్చు
విభ్రాంతి కాఁబోలు ♦ వివరింప నది వస్తు, దర్శనంబునఁగాని ♦ తవులుకొనదు

మోహంబుకాఁబోలు♦ నూహింప దానిచే,నారక తెలివిలే♦ కుండవలయు
నైంద్రజాలక మేమొ♦యరసిచూడఁగ నట్టు, లైననిందుఁబ్రయో క్తి♦గాని
పింపఁ

తే. డహహా గలయును భ్రమయు మో♦హంబు నైంద్ర
జాలకంబును గాదు ని♦శ్చయ మిదేమి
యద్భుతం బంచుఁ బలుమఱు♦ నాత్మలోన
నెంచుచు నొకింతతడవు చిం♦తించుచుండె. 7

వ. అంత. 8

సీ. అంగనామణిరూప♦మబ్బుటయునుమనో,జాతా ర్తియునికుండ♦జనవరునకు
బ్రియపత్నియగుటయు ♦ బిడ్డలనూర్వురఁ,గనుట యువారుసంగ్రామభూమి
బడుటయు క్షుద్బాధ♦బడలుటయునుశివ,సోపానసరణియు♦ నూరివరుని
వచనప్రకారంబు♦వరుసతోస్మరియించి,మదిలోనఁజాలవిస్మయముఁబొంది

తే. యహహాయిదియెన్నవిష్ణుమా♦ యాప్రభావ, మంచుమానసమున నిశ్చ♦
యించియున్న
బ్రహ్మసభలోను నేనుగ♦ర్వమునఁ బలికి,నట్టిఫలమిప్పు డనుభవం♦బయ్యె
నిజము.

—: నారదుండు విష్ణుప్రభావంబు నెంచి విష్ణువును ధ్యానించుట. :—

వ. అని విచారించుచుండెనని యగస్త్యుండు శౌనకున కెఱింగించిన నతం డత
నికిఁ గ్రమ్మఱ నిట్లనియె. 10

తే. ప్రవిమలాత్మకకుంభసం♦భవసురర్షి,యట్లువ ర్తించుచో నిజం♦బరయనెంత
కాలమయ్యెనెఱింగింపు♦కౌతుకంబు, మఱిమఱియు హెచ్చుచున్నది♦మా
నసమున

క. అనిన నగస్త్యుఁడు పలికెఁ, విను మొకత్రుటిమాత్రమయ్యె♦వివరింపఁగ న
య్యనఘుఁడు మెలఁగిన కాలము, మునివరవిష్ణుప్రభావ♦ము గడింది గదా.

వ. అనిన శౌనకుం డంతట నారదుం డెట్లు మెలంగె నెఱిగింపుమనినఁ గలశ
భవుం డిట్లనియె. 13

క. విను మునినాయక యిత్తెఱఁ, గున సురముని తెలివి నెచ్చు♦కొని సామోదం
బున ఘనశక్తియుఁ దనరఁగ, దనమదినఖిలేశు నిట్లుధ్యానము చేసెన్. 14

క. ఎవ్వనిచే సృష్టంబగు, నివ్విశ్వము ప్రోదిసేయు ♦ నెవ్వాఁడు జగం
బెవ్వనియం దడఁగు న్మఱి, యవ్విభునకు నేను బ్రణతు ♦ లర్థి నొసర్తున్.

తే. అచ్చుగఁ జరచరాత్మకం♦బైన యుట్టి, యుజ్జగంబు సమస్తంబు ♦ నెవ్వఁడయ్యె
నట్టిజగదీశునకుఁ బర♦మాత్మునకును, జిరకృపానిధి కేనమ♦స్కృతులొనర్తు.

తే. సర్వభూతాంతరాత్ముని ♦ సర్వవిదుని, సర్వకారణభూతుని ♦ సర్వమయుని
సర్వదురితౌఘహరణుని♦సర్వహితుని, సర్వభువనైకనాయకు♦సంస్తుతింతు.

క. కమలావిభు నారాయణుఁ, గమలభవేశానజనకు.♦ గమలాక్షు నరిం
దముశంఖచక్రయుతకర,కమలున్ భజియింతుహృదయ♦కమలమునందున్.

తే. శేషపర్యంకశాయియై♦ క్షీరజలధి, యందులక్ష్మీసమేతుఁడై♦ యలరువాని
నంతరిక్షంబు కైవడి ♦ నఖిలజగము, నిండుకొనియుండువాని నే నెఱిఁదలంతు

తే. ఆదిమధ్యాంతరహితుఁడై♦యలరువాని, నాదిమధ్యాంతకారణం♦బైనవాని
నఖిలకర్మచయాభోక్త♦ యైనవాని, నఖిలమఖభోక్తయగువాని♦ నభిను
తింతు.

సీ. ఏవిభుపదపద్మ♦ మింద్రాదిసురశిరో, భృతపద్మరాగదీ♦ ధితులఁ బెంచు
నేఘనునామంబు♦ నిచ్చనైన వచింపఁ, గైవల్యనగరసా♦ ఖ్యంబుఁగూర్చు
నేదేవుమూర్తియో♦ గీంద్రమానసపద్మ,కర్ణికాంతరములఁ♦గలసి మెఱయు
నేప్రభుకరుణాని♦ రీక్షణంబార్యుని, సకలకల్యాణభా♦ జనముఁ జేయు

తే. మహిమ నెవ్వనిచారిత్ర♦ మహరహంబు, బ్రహ్మహత్యాదిఘోరపా♦పము
లడంచు
నయ్యనంతు రమాకాంతు♦ నధికశాంతు, నిరుపమస్వాంతు, భగవంతు♦
నేభజింతు.

ఉ. కిన్నరసిద్ధసాధ్యసుర♦ ఖేచరయక్షభుజంగముఖ్యుల
త్యున్నతభక్తిఁ దన్ గొలుచు♦ చుండినవారల కెల్లనెన్నఁడున్
బన్నము లంటనీయక కృపా ♦ మతి నెవ్వఁడు ప్రోదిసేయు న
ప్పన్నగరాజశాయిని బ్ర♦ పన్నగణాభయదాయిఁ గొల్చెదన్. 22

తే. అనలుఁ డొకఁడయ్యు జగతిపై♦ నన్నియెడల
స్థూలసూక్ష్మాకృతులఁ దన♦ ర్చుచు వెలుంగు
నట్లుదా సర్వభూతాంత♦ రాత్ముఁడగుచు
నలరు పరమాత్మ నెప్పుడు♦ నాశ్రయింతు. 23

తే. నటుల నొకఁడున బహురూప♦ నామభేద. ము లమెలంగుచు నేమహా♦త్ముఁ
డచరాచ
రం బగుప్రపంచ మెల్లని♦ రంతరముగ నిండుకొని యుండు సర్వేశ్వ♦
విలయుఁ గొల్తు.

తే. అజ సహస్రాక్షముఖనిఖి ♦ లామరులును. మరియు సనకాదికాశేష ♦
మానివరులు మా. సంబుల నెవ్వాని♦మాయఁదవిలి, భ్రాంతివహియింతు
రమ్మహా♦ప్రభు నుతింతు.

క. నీరజగర్భాండోదరు, నారాయణ నఖిలమునిజ♦నతాంఘ్రిక ళా
పారీణు సకలజగదా. ధారు ననాధారు మదిని♦దలఁతుఁ భక్తిన్. 26

తే. నిఖిలకల్యాణగుణపయో♦నిధికృపాబ్ధి, శంఖచక్రగదాధర ♦ సర్వఫలద
దేవదేవేశ పరమేశ ♦ నజనక.నిగమవేద్య ప్రసన్నుఁడ♦వగుము నాకు.

తే. అజ్ఞుఁడ జడుండనని న్నెట్టు♦లభినుతింప, నేర్తునజ్ఞానమునఁ జేసి ♦ నేనువిష్ణు
మాయఁగడచితి నన్నట్టి♦మాటతప్పు,క్షమయొనర్చిరయుంబ నగ♦గావు
మభవ.

తే. స్వామి భవదంఘ్రియుగసమా♦శ్రయనగౌర, వమునమూఢు♦డనై నేన♦
పల్కినట్టి తప్పుసహియించిప్రోవు మా♦ధవముకుంద పుండరీకాక్షహరి
సర్వ♦భువనరక్ష. 29

నారదునకు విష్ణువు ప్రత్యక్షమవుట

సర్వలోకేశ్వర♦సర్వశరణ్యా యా, శ్రితజనవత్సల♦శ్రీనివాస
పద్మాక్ష మద్భాగ♦పరిశోధక కృపాబ్ధి, నారాయణముకుంద♦వారణేంద్ర
వరద గోవింద♦భ ♦ నత్కటాక్షామృతాం, చితజలంబుల నభిషిక్తుఁ జేసి
నన్నురక్షింపుము ♦నాథనాథయటంచు,దృఢభక్తిమైఁ బ్రస్తుతించుటయును

తే. సతతనిభక్తిబ్రముదితస్వాంతుఁడగుచు, భావనారాయణస్వామి
పతగరాజ వాహనుండును గరుణావివర్ధనుండు, వగుచు నమహా్మనిమోలిం
బ్రత్యక్షమయ్యె 30

వ. అప్పు డచింత్యాద్భుతరూపలావణ్యయౌవనామృతసముద్రుండును, దరుణారుణాంశుమండలమండితానర్ఘమణిగణకిరణపంఘాత దేదీప్యమానకిరీటాన్వితో త్తమాంగుండును, బురందరనీలనికాశ కేశపాశుండును, సుప్రకాశుండును, శుచిస్మితసుధాపరిపూర్ణ పూర్ణిమాచంద్రబింబోపమానవదనుండును, జగత్సదనుండును, మకర కేతననూతనధనుర్లతాసదృశసవిభ్రమభ్రూయుగళుండును, కంబుకంఠుండును, బ్రభాతసమయసముద్దీప్తసహస్రకిరణకరుణమయూఖౌఘ ప్రభిన్నసితాంభోజలోచనుండును, కలుషమోచనుండును గించిదున్మీలితలాలితచాంపేయముకుళాభిరామసునాసుండును, మహోల్లాసుండును, ధావళధళ్యప్రభాపూరహారిహీరశకలోపమాన రదనసముదయుండును, సుహృదయుండును, వసంతావసరలసితనవకిసలాయాంభోజరాగసమానమానితశోణాధరుండును, శ్రీధరుండును, మకరకుండలమణి ఘృణి విరాజమాన శ్రీకారరేఖాతులితకలితశ్రవణగ్రహుండును, దుష్టనిగ్రహుండును, నవీనకందర్పదర్పణప్రతీకాశధగద్ధగాయమాన గండభాగుండును, మహాభాగుండును, కనకకేయూరసరోరుహమాలికారుచిరదిక్కరీంద్ర శుండాలదండసదృగ్వినవృత్తాజాను చతుర్బాహుండును, బ్రపన్నచాతకాంబువాహుండును, నిరుపమమాణిక్యఖచిత శుచితర కనకకంకణా క్షుద్రముద్రికాకీర్ణసిర్ణిద్రకోకనదచ్ఛవిచ్ఛటాభాసమానకరాంభోజుండును, దివ్యతేజుండును, శ్రీవత్సకౌస్తుభాస్తోకముక్తాహారవనమాలికా సహితమహోరఃప్రదేశుండును, నిరీశుండును, యమునాతరంగరంగత్త్రిభంగుండును, నభంగుండును, సురుచిరరత్నసంస్థాపితకాంచనకౌశేయవసనావృతకటిస్థలుండును, నిస్తులుండును, సమున్నతకలభకరనిభోరుకాండుండును, మహాప్రభుండును, బ్రత్యగ్రముక్తాఫలవిమలనఖరాంకురప్రకరుండును, సుకరుండును, హాలకులిశజలచరశంఖచక్రముఖలాంఛనాభిశోభిత సమదరుణతాకరనూపురాలంకృతచరణారవిందుండును, సదానందుండును, సజలజలదాభిరామశ్యామలకోమలదివ్యమంగళగాత్రుండును, ధాత్రీకళత్రుండును, దరదరగదాఖడ్గశార్ఙ్గోపేతుండును, బ్రహ్మాండభాండపిచండుండును, నఖండసచ్చి

దానందవిగ్రహుండును, నాదిమధ్యాంతరహితుండును, నఖిలభువనజనకుం డును, ననంతసహస్రార్బుదమార్తాండ తేజోవిరాజమానుండును, నభంగ వీరపరాక్రముండును, నపవర్గలక్ష్మీప్రదుండును, ననేకాద్భుతదివ్యలీలావ వతారుండును, నపారకృపార సపేశలుండును నాశ్రితరక్షాధురీణుండును నార్తజనశరణ్యుండును, నాగమాంత వేద్యుండును, నభేద్యుండును, నజే యుండును, నప్రమేయుండును, నక్షరుండును, నాత్మమయుండును, ననం తుండును, నద్వయుండును, నభవుండును,నగునాయ్యాదినారాయణుంబొ డగని సాష్టాంగదండప్రణామంబులాచరించి యమందానందకందళిత హృ దయారవిందుండగుచుఁ గరకమలంబులు మొగిడ్చి నారదుం డిట్లనివినుతిం పఁదొడంగె. 13

విష్ణువును నారదుండువినుతించుట.

సీ. సనకాది మునిమన♦ స్సరసిజభ్రమరాయ, వారణేన్ద్రవిపన్ని ♦ వారణాయ
శతమఖప్రముఖని♦ర్జరగణప్రణుతాయ, ఘోరసంసారాబ్ధి♦ తారణాయ
నలినగర్భాభ్రమ♦ద్ధాలబ్బృహజ్జఠరాయ, కూ్రరదైతేయవి♦దారణాయ
కమలావధూముఖ♦ కమలాబ్జమిత్రాయ, దరసుదర్శనశార్ఙ్గ♦ ధారణాయ

తే. ఘనతరాశేషభువనైక♦ కారణాయ, సతతపాలితమునిసిద్ధ♦ చారణాయ
సర్పనగరానవరతప్ర♦ చారణాయ, భావనారాయణాయ తు♦ భ్యం
నమోఽస్తు

దండకము. శ్రీమత్పయోరాశి కన్యాకుచద్వన్ద్వసంలిప్త కస్తూరికాగన్ధసారాఞ్చితస్ఫారదోరన్తరాళాయ విద్వన్మనస్సారకాసారమాద్యన్మరాళాయ నీళాపరీరమ్భసమ్భోగకేళీవిహారా నిశాత్యన్తసన్తుష్టచేతోరవిన్దాయ సంరక్షితామర్త్యబృన్దాయ కన్దర్పకోటీస్ఫురద్దివ్యసౌన్దర్యరేఖా పరిభ్రాజమానాయ నానాయ తీన్ద్రార్జితాఙ్ఘ్రిసన్నిధానాయకారుణ్యమేధాసనాథాయ వేధోమరుత్వద్దినాధీశకీనాశ భేశానలాహీశ ముఖ్యామరస్తోమ మస్తస్థలన్యస్త సౌవర్ణకోటీరకోటీరతామ్భోజరాగ ప్రభాపూరనీరాజితాఙ్ఘ్రిత్పదే థోరితోగాప్రపదే శౌనకాగస్త్యవల్మీకజ వ్యాసవాసిష్ఠ కణ్వాత్రిగాధేయ కౌణ్డిన్యశాణ్డిల్యమాణ్డవ్య ముఖ్యాఖిలర్షిప్రసంస్తూయమాన స్ఫీరోదారభాస్వచ్ఛరిత్రాయ మిత్రేన్దునేత్రా

య మీనాద్యనన్తావతారాయ ధీరాయ ఘోరాఘసఙ్ఘాతశుష్కాటవీహవ్య
వాహాయ మానసప్రకృష్టారునామైకసముద్యన్మహిమ్నె పదాబ్జప్రసృష్టాగతగఙ్గా
పరిస్నిరధారావళీక్షాళితాశేషదోషాయ నిత్యప్రతోషాయ దోషాచరాదభ్ర
కాలాభ్రఝఙ్ఝాసమీరాయ వీరాధివీరాయ క్షీరార్ణవాకాన్తలీలా విహారా
య పుణ్యప్రచారాయ జామ్బూనదస్ఫీతపీతామ్బరాలఙ్కృతాఞ్చత్కటీరాయ
శూరాయ గమ్భీరనీరాన్తరాళోగ్రకుమ్భీరసంరుద్ధకుమ్భీన్ద్రసంరక్షణాదమ్భ
సంరమ్భసమ్భావమానాయ సమ్మోదితాశేషదీనాయ నీరేజగర్భాణ్డభాణ్డచ్ఛ
టాపూరితోద్యత్ప్రచణ్డాయ సఙ్గ్రామకేళీప్రచణ్డాయ సృష్టిస్థితిధ్వంసనప్రక్రి
యాహేతవే పక్షిరాట్కేతవే పద్మనాభాయ ప్రావృడ్ఘనాభాయ సద్భక్తసం
రక్షణామోఘవిద్యాప్రవీణాయ వేదప్రమాణాయ సంసారదుర్వ్యాధివైద్యా
య వేదాన్తవేద్యాయ నిర్వాణసామ్రాజ్యలక్ష్మీప్రదాత్రే ప్రజానాధపిత్రే
నమోవిష్ణవే భార్గవరిష్ణవే కృష్ణరూపాయ విశ్వస్వరూపాయ తుభ్యం నమశ్శ
ఙ్ఖచక్రాసి కౌమోదకీశార్ఙ్గహస్తాయ లోకప్రశస్తాయ తుభ్యం నమస్సర్వకా
మార్థసంస్థాయినే సర్వభూతాన్తరస్థాయినే సర్వపూర్భావ నారాయణస్వామి
నే సిన్ధుజాకామినే సర్వలోకైకకర్త్రేనమ స్సర్వహర్త్రేనమో వాసుదేవాయ
దేవాదిదేవాయ తుభ్యం నమస్తే నమస్తే నమస్తేనమః 33

మ. పురుహూతప్రముఖాఖిలామరశిరో♦భూషాగ్రరత్నచ్ఛటా
నిరవద్యానుపమప్రభోత్కరముహు♦ర్నీరాజితాంఘ్రిద్వయున్
శరణం బొందెద నిన్ను నన్ను నెపుడున్ ♦ సంప్రీతిరక్షింపు సు
స్థిరకారుణ్యకటాక్ష సర్పనగర♦శ్రీభావనారాయణా. 34

క. శతధృతిశతమఖముఖులున్, నుతులుంగొనియాడలేని♦చో నేనిన్నున్
నుతియింప నెంతవాఁడను, నతరక్షణదీక్ష సర్ప♦నగరాధ్యక్షా, 35

క. ఏమనియెద నాభాగ్యము, నీముఖచంద్రోదయమున♦నెఱి నుప్పొంగెన్
నామానసార్ణవం బిపు, డోమహనీయప్రభావ♦యోగిశరణ్యా. 36

వ. మహాత్మా భవదాలోకన ప్రసారణ దవానలంబున మదీయ పూర్వజన్మసం
భృతకిల్బిషారణ్యంబు దగ్ధంబయ్యె భవదీయకృపాపూరప్రసారణంబున
నఘానలతప్తంబులగు నింద్రియంబులు ప్లావితంబులయ్యెనింక మదజ్ఞానఘ
నధ్వాంతవిభాకరుండ వగునిన్నునెప్పుడు ధ్యానంబొనర్చెద నీయనన్తక

ల్యాణగుణానీకం బనవరతంబు గీర్తించెద భవద్భక్తప్రవరాం భోజదర్శనమనో
రథుండనై సుజ్ఞానులోకంబుల సంచరించెదనని ప్రార్థించు చున్ననారదునకు
భగవంతుం డిట్లనియె. 37

## నారదునకు విష్ణువనుగ్రహంబుఁ జూపుట.

సీ. నీయభిప్రాయంబు నేనెఱుంగుదు వత్స, సకలభూతాంతరాత్మకుఁడనైన
నాకెద్దియును గానరాకుండునది లేదు, నామాయఁదరియింప నాకులకుమ
హాస్త్రులకైన శక్యంబుగా దిట్టులో, కులకిది దెలుపుట కొఱకు బరాని
యెనుసీచేతఁ జేయించితినిఁక నీ, వళుకక స్థైర్యంబు గలిగి యుండు

తే. ధరణిని పేరనీసరోవరము శేష పాతక వ్రాతనాశకమైతనర్చు
నిజ్జలంబుల మునిఁగిన సజ్జనుండు, పొసగ నఖలశుభంబులఁ బొందుఁజుమ్ము.

తే అమితకలుషాకరం బగునట్టిస్త్రీత్వ, మాగతంబయ్యె నిత్తటాకావగాహ
నమున నట్లైననిది భవన్నామకమున, వఱలుఁబో నీవు మద్భక్తవరుఁడ
వగుట. 39

తే. ఇత్తటాకంబు మదిస్మరియించుజనుల, కఖిలకలుషాపహరణంబు యతికు

సంతసంబున మునిఁగెడుస్నాతజనుల, కెల్లనిది పుత్త్రసంపత్సమృద్ధిదంబు.

క. విను మత్సంకల్పంబున, మునివల్లభ నీకు స్త్రీత్వముఘటిల్లె నటుల్
జనులున్ మత్సంకల్పం, బునఁ గడుశుభసంతతులను బొందుదురు సుమీ.

తే మునికులోత్తంస యద్భుతంబుగను నీకు, నంగనాత్వవిముక్తి యయ్యెఁ
గాన
నది ధరిత్రీస్థలిఁ బ్రసిద్ధమగుచు నెపుడు, ముక్తికాసార మనుపేర మొనసి
యుండు. 42

క. ఇచ్చెఱువున మునిఁగినజనుఁ, డచ్చెరువుగ దురితరహితుఁడై శుభఫలముల్
గొ్రచ్చుకొనియనుభవించుచు, విచ్చలవిడిఁ బుత్త్రపౌత్త్రవృద్ధిఁ జెలంగున్. 43

క. ఇదిమొదలుగ నీసరసిన్, ముదమునఁ గ్రుంకులిడుజనుఁడు ముక్తుండై మ
త్పదమునకునరుగుఁ గొదుకక, తుదిభవబంధముఁ బాసి సుస్థిరతనూజా.

తే. సిద్ధముగ ముక్తికాసార♦ జీవనావ
గాహన జనాఘనిచయ మొ♦క్కటనునూర్పు
లూర్చుచును రోదనంబుసే♦యుచును జాల
నద్భుతముగఁ బలాయితం♦ బగుచునుండు. 45

తే. గణుతియొనరింప మూఁడులో♦కములయందుఁ, బావనములైనతీర్థంబు♦లేవి
గలవ
వన్నియును నిందువసియించు♦నహరహంబు, నమరమునిచంద్ర వినుసంశ♦
యంబులేదు.

తే. అవనిమానవుఁ డిచ్చలే♦నైన నీస, రోవరోదక మించుక♦ గ్రోలెనేని
యాక్షణంబున వెసఁబలా♦యనమునందు, బ్రహ్మహత్యాదికములైన♦ పా
తకములు.

తే. ముక్తికాసార మనుపేరు♦ మొనసిమనుజుఁ, డాత్మలోపలస్మరియించు♦
నంతమాత్ర
మున నశేషాఘభవబంధ♦ములను బాయు,స్నానఫలమేమిచెప్పుదు♦సంయ
మీంద్ర.

తే. గ్రహణవేళల విషువసం♦క్రాంతితిథుల, నయనములయందు మూలాన్వి♦
తాహములను
దవిలిస్నానంబొనర్చిన♦ధన్యుఁడొందు నశ్వమేధసహస్ర♦సమ్యక్ఫలంబు. 49

తే. పూషుఁడు మకరస్థుఁడైన♦ పుడును మాఘ,మాసములయందు నాదిత్య♦
వాసరముల
హారిదినంబులస్నానమం♦దాచరించు,ఫలమువ్రాకువ్వనజునకు♦నలవిగాదు.

సీ. ఇమ్ముక్తిసరసీత♦ టమ్మున విమలోద, కములచేత నివాప♦ కరణమాచ
రించుటవలనఁ బి♦తృశ్రేణులకు ముక్తి, కరతలస్థంబయి ♦ పరఁగుజహ్ను
తనయాదిపుణ్యతీ♦ ర్థములనివాపాంజ, లులచేత నయ్యెడు♦ ఫలముజనుల
కిచ్చుట సిద్ధించు♦ నెన్నంగ గంగాది, పుణ్యతీర్థములెన్ని♦ భువినిగలుగు
తే. వన్నియును నిందువసియించు♦ నహరహంబు, ఘనతరంబుగ నాదుసం♦
కల్పమునను

బితరులకు నెవ్వఁడిచ్చోటఁ♦ బిండమొసఁగుఁ నతఁడుతరియింపఁజేయుస్వ♦
పితృజనులను.

క. వటవిటపిక్రింద గయలోఁ, బటుమతిఁ బిండంబువిష్ణు♦ పదమున నిడుమేల్
ఘటియించు ముక్తిసరసీ, తటమునఁ బిండంబొసంగు♦ ధన్యాత్ములకున్.

ఆ. అఖిలయజ్ఞభోక్త♦ నైననే నిచ్చట, నధివసించి జనులకఖిలఫలము
లొసఁగుచుందు వినుము♦ యోగికులోత్తమ, మహిమవిస్తరిల్ల♦ నహ
రహంబు.

క. సీమీఁదిపేరిమమున నిం, దోమునివర నిలిచియుందు♦నుర్వీజనులచే
నేమమునఁ బూజగొనుచుమ,తేమిఁక దుర్లభము జనుల♦కిలఁగలదరయన్.

క. నారద యిమ్ముక్తిసర, స్తీరంబునఁ జేయుజప ము♦ చితదానంబుం
బేరిమి నప్పుడె జనులకు సారంబైనట్టిఫలము♦ సమకూర్చుఁజుమీ. ౫౫

సీ. వినుమింకమాటలు ♦ వేయునేల మునీంద్ర, గురుతల్పగ సురాప ♦ గోఘ్న
మాతృ
హులుఁ బరదారర♦ తులు భ్రూణహులును బ్రహ్మఘ్నులుఁ గనకాప♦
హారణులాది
గలమహాపాతకు♦ లెలమి నీసరసీద్వ, యంబున స్నానంబు♦ లాడిరేని
యప్పుడే వారుఘో♦ రాఘనిర్ముక్తులై, సురుచిరైశ్వర్యంబు♦ సుతసమృద్ధి

తే. యాయురారోగ్యసంపద♦ యతిశయిల్ల, నంత్యమున విష్ణులోకసౌ♦ ఖ్యా
నుభవని
రంతరామోదమేదుర♦స్వాంతులగుచు, నలరుచుందురుసుమ్ము త♦థ్యంబు
గాఁగ.

వ. అని యిట్లు భగవంతుం డానతిచ్చిన నారదుం డమ్మహానుభావున కిట్లని
విన్నవించె.

తే. అభవమద్భాగ్యమాలిన్య♦ మపహరించు, కొఱకు నీవిలఁ బ్రఖ్యాతి♦ మెఱ
యనిందు
భావనారాయణస్వామి♦ నైవసించి, యున్నవాఁడవుగద భువ♦నోపకృతిగ.

తే. రమ్యపాదపనివహావి♦ రాజితంబు, పావనంబైనయీసరో♦వరతటమున
రూఢిమీఱంగ నర్చాస్వరూపమునను,వనజలోచన నీవుండవలయుఁజుమ్మి.

వ. అయిన నిన్నుఁ బ్రతిష్ఠాపితుం జేసెదనని యుత్సహించెద దానం జేసి నాకు నిర్దోషంబు పరిహారంబగు భవత్కటాక్షవీక్షణంబునఁ బ్రసిద్ధుండవగుదు గదా యని విన్నవించిన జనార్దనుఁడు వెండియు నతనికిట్లనియె. 60

తే. మున్న చెప్పితిఁ బన్నగ ముఖ్యుఁడైన, యయ్యనంతుని కిమ్మాట నెయ్య మలర
నట్లుగావున నిచ్చోట నధివసింతు, నన్నుఁ గావింపుమి కమునీంద్రాగ్రగణ్య.

వ. అని యాశ్రితాదీనవ ర్తనుం డగు గరుడధ్వజుం డాడిన లోకానందకరంబైన వాక్యంబఖిలంబు నాకర్ణించి పరితుష్టుఁడగుచు నమ్మునిశ్రేష్ఠుండు ప్రతిష్ఠావిధానంబుఁ బ్రయత్నంబు సేసె నని శౌనకున కగస్త్యుం డెఱింగించినఁ గ్రమ్మఱ నతండతని కిట్లనియె. 62

—: నారదుఁడు భావనారాయణునిఁ బ్రతిష్ఠ సేయుట. :—

క. అరయ నఖిలజ్ఞుండగు, నారద మునివరుఁడు భావనారాయణు ల
క్ష్మీరమణీరమణుని దా నే రీతిఁ బ్రతిష్ఠ సేసె నెఱిఁగింపఁగదే.

వ. విస్మయానంద కారణం బగు ప్రతిష్ఠావైభవంబు నాకుం దెలుపు మనినఁ గలశోద్భవుం డిట్లనియె. 64

క. శంభుఁడు జంభవిరోధియు, నంభోజభవుండు శశియు నర్కుఁడు దివిజుల్
రంభాముఖముఖులున్ సం, రంభంబున వచ్చి రపుడు రహి నచ్చటికిన్. 65

వ. అప్పుడజుండు నభోమాసంబున శుక్లపక్షంబున గురువాసరంబున సింహలగ్నంబునఁ గనత్కనక ప్రాకారసంవృతంబును రత్నగోపురవిరాజితంబును జిరత్నరత్నఖచితవితర్దికాసోపానమండపకుట్టిమద్వారబంధబంధురంబును మణిస్తంభసహస్రభాసితంబును విశ్వకర్మనిర్మితంబు నగు మహనీయప్రాసాదాంతరంబున సముత్తుంగ భద్రసింహాసనంబున శ్రీమద్భావనారాయణదేవు లక్ష్మీసమేతు విధ్యుక్తప్రకారంబున సంస్థాపితుం జేసె నయ్యవసరంబున. 66

సీ. దేవదుందుభి మహారావంబు లెసఁగెఁ గం, ధర్వకిన్నరులు గీతములు వాడి
రప్సరోభామినులు లదనొప్ప నాడిరి, జలదముల్ పుష్పవర్షంబు గురిసె

మునులు సామ్యామ్నాయమ్ముల వినుతించిరి, మునుకొని శుభతూర్యములు సెలంగె
ననిమిషుల్ జయజయధ్వనులతోఁ గీర్తించి, రనుకూలగంధవాహములు వీచె
తే. నంత బ్రహ్మపురందరాద్యమరవరులు, నారదాదిమహామునినాయకులును
భావనారాయణస్వామి దేవదేవుఁ, బ్రీతిఁ బొగడిరి మంగళగీతములను. 67
వ. వెండియు నద్దేవు నిట్లని వినుతించిరి. 68

## దివిజమునిముఖ్యులు స్వామిని నుతించుట.

తే. దేవదేవ జనార్దన దివిజవినుత, యఖిలలోకైకకారణ యప్రమేయ
భూతభవ్యభవన్నాథ భువనవంద్య, వేదవేద్య రమాధీశ విశ్వనిలయ. 69
సీ. దివి మస్తకము చంద్రదినకరుల్ కన్నులు
వహ్నిముఖంబు దేవతలు భుజము
లవని యంఘ్రులు విహాయసము పొక్కిలి దిశల్
శ్రవణంబు లామ్నాయసమితి వాక్కు
లనిలుఁడు ప్రాణంబు యముఁడు మానసము నా
కంబు కంధరమును గచభరంబు
భారతి నాలుక పాథోనిధులు కుక్షి
క్రతుభుక్చికిత్సకుల్ కటితలంబు
తే. గాఁగ విశ్వస్వరూపివై కరము మెఱయు, చుండు నీమేన నలినగర్భాండభాండ
మండలు లుదుంబరఫలోపమానములయి, వెలయుచుండుఁ గదా జగద్వినుతచరిత.
వ. అనంతబ్రహ్మాండసంఘాతంబు లెవ్వని నిశ్వాసోచ్ఛ్వాసద్వయంబున విడువంబడుచు నాహరింపంబడుచుండు నెవ్వని మేషోన్మేషంబుల నఖిలలోకసముదయం బడఁగుచుం బొడముచుండు నట్టి యఖిలలోకశరణ్యుండ వగు నట్టి నీకు నమస్కారంబు, 71

తే. అమరవరులకున్నైన మ♦హర్షిజనుల, కైన నీమాయఁగడవశ♦క్యంబుగాదు
హీనమతు లగువారికిం♦ కేమిచెప్ప, భక్తవత్సల జగదీశ♦ పరమపురుష.

తే. జ్ఞానిజనవంద్య మమ్ము నీ♦మాయవలన, దాఁటఁగాఁ జేయు మేతద♦ర్థంబు నిన్ను
శరణుఁగంటిమి నీ పాద♦జలజయుగము, కన్నమాకన్యసాధనం♦బెన్నఁగలదె.

క. శరణాగతజనభయసం, హరణాయ సమస్తమునిజ♦ నార్చితశుభక
చ్చరణాయ నిత్యనిర్మల, కరుణాయ సుధీనుతప్ర♦కరణాయ నమః. 74

వ. అని యిట్లు బహుప్రకారంబుల నద్దేవదేవుం బ్రణుతించి మఱియు శ్రీ
మహాలక్ష్మి నిట్లని వినుతించిరి. 75

—:దివిజమునిముఖ్యులు లక్ష్మిని నుతించుట:—

క. కమలా బుధజననుతపద, కమలాకరధృతనవీన♦ కమలావిలస
త్కమలావాసిని మమునీ, విమలకృపాలోకనమున♦ వీక్షింపఁగదే. 76

తే. మణిమయస్వర్ణపూర్ణకుం♦భములుపూని, తవిలియిరుగడఁ గరికులేం♦ద్రములు గొల్వఁ
చామరంబులుపూని ని♦ర్జరవధూటు, లెలమిభజియింప నలరునీ♦ గొలుతుమంబ

ఉ. నీకరుణావిలోకనము♦ నిల్చినచోఁ గులహీనుఁడున్ హయా
నేకపహేమచామరమ♦ణీరమణీయవిభూషణాదికా
స్తోకవిభూతిఁ జెంది పరి♦శుద్ధకులుం డన మించు లేనిచో
నాకనివాసుఁడున్ వెతల♦నందుగదమ్మ జగత్కుటుంబినీ. 78

చ. ఉవిద లనంగుఁడంచు విబు♦ధోత్తము లర్కతనూజుఁ డంచు శా
త్రవులు కిరీటియంచు వసుధా♦జనులెల్లఁ బ్రభుండటంచు బాం
ధవులు సముద్రుఁడంచు విత♦తంబుగ నెన్నుదు రెట్టిదుర్జన
ప్రవరునినైన నీకరుణ♦ పర్వినవాని సరోజగేహినీ. 79

మ. పురజిద్దానవజి త్సుధాశనవరాం♦భోధీశ యక్షాధిపా
శరరాడ్వహ్ని పరేతరాజ మరుదీ♦శానాదికం బైనయీ

సురబృందంబు భవత్కృపాగరిమ న ♦ క్షుద్రప్రభావంబులో
నిరవొందం గద కేశపాశజితమ♦ త్తేందిందిరా యిందిరా. 80

ఓజనని నీవుగలచో, నేజాతివిహీనుఁడైన ♦ నిలఁ గొలుతురు రా
రాజులుఁ గవిరాజులు బుధ, రాజులు గమికట్టి కడలి♦ రాయనిపట్టీ. 81

మతిమఱవున్మను నుస్సురను♦మందతఁ జెందుఁ గృశించుమాటికిన్
వెతపడు నీచవర్తనుల♦ వేఁడఁగఁ జూచు విధిన్ సళించు లో
ధృతిచెడికుందుఁ జెంగొను♦ నెట్టిమహోన్నతుఁడైన నీజగ
ద్వితకరుణారసప్లుతని♦ రీక్షణమబ్బని వేళ శ్రీసతీ. 82

అతితర వేదశాస్త్రనిగ♦ మాంతపురాణకథావిధానవి
శ్రుతుని దరిద్రుఁ జేయుదువు♦ చూడ నికృష్టుఁ బ్రకృష్టభాగ్యసం
యుతునిఁగఁ జేయుచుండుదు వ♦ హో పరికింప జగంబులందు న
ద్భుతముఁగదమ్మ నీమహిమ♦ తోయజనాభవిలాసినీమణీ 83

కదిసి నినుఁబల్లాలిఁ♦ గాఁ జేసికొనిగదా, హరి పురుషోత్తముం♦ డనఁగఁ బరఁగెఁ
దివిరి నీతోడ నుద్భవమునొందుటఁగదా, శశికి రాజత్వంబు♦సంభవించెఁ
గోరి నిన్నారాపుఁ♦గూఁతుఁగాంచుటఁగదా, వనరాశిరత్నాధి♦వాసమయ్యె
దర్పించి నీకునం♦దనుఁడౌటచేఁగదా,మారుండుమోహనా♦కారుఁడయ్యె
నహహ భవదీయదివ్యమా♦హాత్మ్యమెన్న,నలవికాదుగదమ్మ శే♦షాహికైనఁ
గలితశుభగాత్రి పరఢిత♦కాళరాత్రి, సకలలోకైకజనయిత్రి♦ జలధిపుత్రి.
అని వినుతించుదివిజమహర్షివరులం గనుంగొని యానందోత్ఫుల్లమాన
సుం డగుచుఁ బితామహుం డిట్లనియె.

—♦ బ్రహ్మ దేవాదులకు హితంబు బోధించుట ♦—

సురలార పరమసంయమి, వరులార సమస్తభువన♦ వంద్యుం డగు నీ
హరి నీక్షింపుఁడు మీకుం, జిరతరశుభఫలము లిపుడె♦ చేతికివచ్చున్. 86

కనుఁగొనుఁ డిద్దేవునిలో,చనములు గలఫలము పూజ♦ సలుపుఁడుకరముల్
దనరుటకుఫలము జిహ్వక,యొనరుటకుఫలంబుపొగడుఁ♦సురగణయానుల్.

తే. శ్రుతులు గలఫల మిమ్మహా♦ న్నతునికథలు
వినుఁడు చరణద్వయంబు గ♦ ల్గినఫలంబు
పాయకప్రదక్షిణంబులు♦ సేయుఁ డుత
మాంగము గలఁదులకు మ్రొక్కుఁ♦ డచ్యుతునకు. 88

సీ. వినుఁడు సురలార మునులార♦వీనులలర, భావనారాయణునకు స♦ద్భక్తితోడ
ధరణిఁ జాఁగిలి మ్రొక్కిన♦ ధన్యతముఁడు, నిఖిలలోకైకపూజ్యుఁ డై♦నివ్వటిల్లు

. ముద మొదవఁగ నీస్వామికిఁ, గదిసి ప్రదక్షిణము భక్తిఁ♦ గావించుమహా
సదమలతరమానసులకుఁ, బదపదమున నశ్వమేధ♦ ఫలము లభించున్ .90

తే. భృగుదినంబున నీజగ♦ద్విభుని నెవ్వఁ, డవిరళంబుగ నభిషేక♦మాచరించు
వాఁడు నిస్తులశాశ్వతై♦శ్వర్యధుర్యుఁ, డగుచు ధాత్రీతలంబున♦నతిశయిల్లు.

తే. అవని నెవ్వండు భావనా♦ రాయణునకుఁ
గుసుమమాలిక లర్పించుఁ♦ గోర్కి మీఱ
నతఁ డదభ్రసుఖావహం♦బైనయట్టి
దివ్యదేహంబు దాల్చి వ♦ ర్తించు దివిని. 92

తే. భావనారాయణాహ్వయ♦ స్వామిమ్రోలఁ
గడఁగి మంగళదీప మే♦ ఘనుఁడు నిలుపు
నతనిఘోరాఘనిచయంబు♦ లళికి యుఱకుఁ
గమలమిత్రోదయమునఁ జీఁ♦ కటులువోలె. 93

తే. గుడపయోఘృతమిశ్రమై♦ గుబులుకొను హ
విష్య మెవ్వాఁడు స్వామి క♦ ర్పించు భక్తి
వితతముగ నాతఁడు పునరా♦ వృత్తిరహిత
శాశ్వతబ్రహ్మలోకైక♦ సౌఖ్య మొందు. 94

. ఇద్ధరణిధరుప్రసాదము, శుద్ధాత్ముం డగుచు ముదము♦ సొంపెసలారన్
సిద్ధార్థమాత్ర మెవ్వఁడు, సిద్ధంబుగ మెసఁగు నతఁడు♦ సిద్ధార్థుఁ డగున్ .95

. అనిచెప్పి మఱియు నిట్లనియె, 96

భావనారాయణ♦దేవుని సేవింపఁ, దప్పక యే యేట♦ దవిలియేను
సంతసంబున ధను, స్సంక్రమణంబుల, వ ణీయుతుండనై ♦ వచ్చుచుందు
మీరును దప్పక♦ దారసమేతులై, వాలెంబు నిచటికి♦ వచ్చుచుండి
యిద్దేవు దర్శించి♦ యెలమిఁ బ్రదక్షిణ, నతినుతిపూజాభి ♦ రతులనలరఁ
జేయుచుండుఁడు పూజ్యతఁ♦ జెంది కడుఁగృ
తార్థు లయ్యెద రెవ్వఁడీ♦ హరికి ధన్వ
మాసమున నించుక హవిస్స ♦ మర్పణంబు
చేసెనేని యతం డొందు♦ సిద్ధపదము. 97

ఒనర నుత్తరఫల్గునీ♦ యుక్తమైన
హరిదినంబున వృషభంబు♦ నందు నినుఁడు
మలయునప్పుడు వైశాఖ♦ మాసమునను
రండు మీరింపు మరలఁ బెం♦ బండువుగను. 98

వచ్చి మీరందఱు♦వైశాఖమునఁ దార,సిలి యర్ఘ్యపాద్యాభి♦షేచనముల
జందనాగరుఘన♦ సారకాశ్మీరక, ద్రవధూపదీపనీ♦ రాజనముల
మందార కేతకీ♦ మల్లికా చంపక, నవతులసీదళ♦ నివహములను
బనసరసాల రం♦ భానారికేళ ఖర్జూరకాదికఫల♦స్తోమములను
భక్తిదైవాఱఁ బానీయ♦భక్ష్యభోజ్య, లేహ్యచోష్యాదికముల నా♦ళీకనేత్రు
భావనారాయణునిమహా♦ ప్రభునిఁ దృప్తుఁ, జేసి తత్కృపవడయుఁడీ♦ ప్సి
తములొదవు.

భావనారాయణార్పిత♦పావనప్ర,సాదములుగొని చనుఁడు మీ♦స్థానములకు
నిర్విభునాజ్ఞవడసి యేఁ♦ టేటనిట్లు,వచ్చుచుండుఁడు నియమంబు♦ వాటిలంగ.
భావనారాయణుని మహా♦ప్రభునినీవు, భాసురంబగు వైశాఖ♦మాసమునను
గనుచుఁబొగడుచు నుతుల న♦ ర్చనలనిడుచు, జనుఁడభీష్టఫలంబుల♦ నెన
యుఁజుండి.

అని తెలుపుచున్నయప్పద్మసంభవునకు దివిజమహర్షి పుంగవు లిట్లని విన్న
వించిరి. 102

అఖిలాండనాయక♦ యబ్జగర్భ సమస్త, నిర్జరనాథ వా♦ణీసహాయ
భావనారాయణ♦ దేవునిసేవించి, సంతుష్టుఁ జేయ మే♦ మెంతవార

మీవె సమర్థుఁడ♦ వీక్షణాధ్యాపస, న్నుతిసపర్యానమ♦ సత్కృతులయందు
నైన నీయాజ్ఞగా♦ దనక ప్రత్యబ్దంబు, వాలెంబు నిచటికి♦ వచ్చి దేవ

తే. దేవ బ్రహ్మాండనాయకు♦ దివిజవంద్యు, నిందిరాధీశు సనకస♦ నందనాది
పరమమునిగేయు బుధజనభాగధేయుఁ, గరము భజియించెదము భక్తి♦
వరద యనఘ.

వ. మఱియు నుత్ఫుల్లగండస్థలయుగళుండును బుండరీకదళాయతేక్షణుండును దరస్మిత చంద్రికావికాసాపహారితకలుషాంధకారుండును శంఖచక్రగదాభయప్రదర్శకభుజోజ్జ్వలుండును దనుమధ్యుండును శ్రీవత్సకౌస్తుభాంభోధితనయావాసతనుమధ్యుండును జగజ్జనధరుండును బీతకౌశేయవాసుండును శారదాంభోజనీకాశపదద్వయరాజితుండును సర్వప్రభుండును నగు శ్రీమద్భావనారాయణమహాప్రభుసేవార్థంబు కళత్రబాంధవోపేతులమై ధనుర్మాసవైశాఖమాసంబుల నీవెంబడి వచ్చుచుండెదమని విన్నవించుచున్న సమయంబున శంభుండు భావనారాయణస్వామి నిట్లని వినుతించె. 104

—♦ శంభుండు భావన్నారాయణస్వామిని నుతించుట ♦—

తే. మహియు సలిలంబుఁ దేజంబు♦ మారుతాభ్ర
ములు మనోబుద్ధ్యహంకార♦ ములును భిన్న
సరణు లయ్యు నభిన్నతఁ♦ బరఁగి యేమ
హామహానిరూప మయ్యె న♦ య్యనఘుఁ గొలుతు. 105

వ. మఱియు నాబ్రహ్మస్తంబపర్యంతంబు స్థావరజంగమాత్మకంబగు జగంబెవ్వాని లీలాపరికరంబట్టి నీకు నమస్కారంబు నేనును జతుర్ముఖసోమసూర్యపురందరాదిసమస్తదేవతలు నెవ్వానితనుభూతంబులమైతి మట్టినీకు నమస్కారం బీశ్వరత్వాభిమానుఁ డగు మమ్ముఁ బోఁట్లఁ బ్రతిబోధించుటకై నారదునకు స్త్రీత్వంబును బురుషసంసర్గంబును బుత్త్రశతోదయంబును దత్పంచత్వంబున నత్యంతదుఃఖంబును గల్పించి క్షణమాత్రంబునఁ గ్రమ్మఱ మహర్షిం జేసి పరతంత్రుండవై పరఁగుచున్న నీమహత్త్వంబు దెలియ నెవ్వం డర్హుండు నీవు నాకిట్టినిశ్చలబుద్ధి యొసంగుమని ప్రార్థించుచున్న సమయంబున నారదుండు హరికిట్లనియె. 106

—♦ నారదుండు హరిని వేఁడుకొనుట ♦—

తే. భావనారాయణ కృపాబ్ధి♦ దేవదేవ, నిఖిలలోకశరణ్యా నే♦ నిన్ను శరణు
నందుము ననారతంబు నా♦ యందుఁ గలుగు, వత్సలత నిందునీవుండ♦
వలయుఁజుమ్మి

సీ. పుణ్యమానసు లైన♦పురుషులచేత నా, రాధ్యమానుండవై ♦రహిసివారొ
సంగుతత్త్వార్థ♦సముచితారాధనం, బుల దృష్టిఁబొందుచు♦వలర వారి
కీప్సితార్థఫలంబు♦లిడుచు శ్రీదేవియు, భూదేవి నీళయు♦భుజగవిభుఁడుఁ
బతగేంద్రసేనేశ♦పరివారములుఁ గొల్వ, వైకుంఠమునసుండు♦వల నెసంగఁ

తే. జిరతరంబుగ నిమ్మహా♦క్షేత్రమున వ. సించి యాశ్రితజనుల ర♦క్షించు
చుండు
సర్వపురవాస భువనర♦క్షణవిలాస, భావనారాయణ మహాను♦భావదేవ.

క. మంగళమునీకు శ్రితజన, మంగళదాయక మునీంద్ర♦మానసవిలస
ద్భృంగాయమానవిగ్రహ, మంగళ మఖిలాండకోటి♦మహితపిచండా. 109

సీ. మఙ్గళమస్తు ర♦మాముఖాబ్జపతఙ్గ, మఙ్గళమస్తు భు♦జఙ్గశయన
మఙ్గళమస్తు సా♦మజరాజపరిపాల, మఙ్గళమస్తు వి♦హఙ్గగమన
మఙ్గళమస్తు మ♦న్మథసున్దరాకార, మఙ్గళమస్తు క♦ల్మషవిభఙ్గ
మఙ్గళమస్తు కో♦మలదివ్యవిగ్రహ, మఙ్గళమస్తు ర♦థాఙ్గహస్త

తే. మఙ్గళం తే కమలజాణ్డ♦మహితజఠర, సర్వపురవాస భక్తర♦క్షణవిలాస
భావనారాయణప్రభు♦వర సమస్త, మఙ్గళాని భవన్తు తే♦మదనజనక. 110

ఉ. మంగళ మిందిరావిమల ♦ మానసనవ్యసరోరుహాళికిన్
మంగళ మాశ్రితావనస ♦ మగ్రకళావిలసద్గుణాళికిన్
మంగళ ముగ్రదానవత♦మస్సమవాయకరాళహేళికిన్
మంగళ మండజప్రవర ♦ మంజులపాలికి దేవమాళికిన్. 111

వ. అని యనేకప్రకారంబులఁ బ్రార్థించుచున్న నారదమునీంద్రునకు భగ
వంతుండు మేఘగంభీరవాక్యంబుల నిట్లనియె. 112

భగవంతుండు నారదునియెడఁ బ్రీతుఁడగుట.

సీ. నారద యింక ర ♦ మారమణీ భూవ,ధూ నీళలను వేడ్కతోడఁ గూడి
మానితచ్ఛత్రచా ♦ మరపాణు లగుదివ్య, సూరిజనుల్ గొల్వ ♦ సుభగలీల

నాశ్రితావళికిప్పి ♦ తార్థము లొసఁగుచు, నురువైభవంబున ♦ నుండువాఁడ
భువి మదీయక్షేత్ర ♦ ములు నూటయెనిమిది, గలవందు సర్పన ♦ గర మహాప్ర
తే. భావ మెంతయు నధికమై ♦ పరఁగుదీని, నైదుకోసుల నందు చ ♦ రాచరములు
మత్స్వరూపంబులు నిజంబు ♦ మదినెఱుంగు, వినుత గుణగణ్య నారద ♦
మునివరేణ్య.

మూఁడుదినములిందు ♦ ముదమొప్ప నెవ్వాఁడు నిలిచియుండు భక్తి ♦ నివ్వటిల్ల
నజ్ఞానుండు శతస ♦ హస్రాశ్వమేధఫ, లంబుఁ జెందు నిశ్చ ♦ యంబుగాఁగ. 114

జనుఁ డీక్షేత్రము దర్శిం, చినఁ బుణ్యం బొదవుఁ బ్రీతిఁ ♦ జేసిన ఘనపు
ణ్యున కపవర్గము కరతల, మునకుఁ జెచ్చును నిజంబు ♦ మునివరతిలకా. 115

నరుఁ డంత్యమునందుఁ గళేబర మిచ్చట విడిచె నేని ♦ భవముక్తుం డై
పరమపదప్రాప్తుం డగు, సరియొదవని కీవి నార్య ♦ జనులు నుతింపన్. 116

## గ్రంథ ఫలాదిస్తుతి.

అని యిట్లు భగవంతుండు నారదునకుం జెప్పి దివిజర్షి వరులకు యథాస్థానంబునకుం బోవ నాజ్ఞయొసంగిన నంత బ్రహ్మాది దేవతలును నారదాది మహర్షులును భావనారాయణస్వామికి నమస్కారంబు లొసంగి చనిరి. ముక్తికాసారనీరంబుల మునింగి భావనారాయణదేవుని దర్శించిన నరుండు శుభసంతతులఁ బొంది పునర్జన్మరహితుండగు. నీక్షేత్రమాహాత్మ్యంబు వినిన వినిపించినఁ బఠించిన లిఖించిన సజ్జనుండు విష్ణులోకప్రాప్తుం డగు నని కుంభసంభవుండు శౌనకునకుం జెప్పిన విని వసిష్ఠుం డంబరీషున కెఱింగించిన నతం డత్యంతసంతుష్టాంతరంగుం డయ్యె. 117

వలనొప్ప బ్రహ్మకై ♦ వర పురాణోక్తమై, సర్పనగరమా ♦ హాత్మ్యమలరు
నదియేను శాలివా ♦ హనశకాబ్దంబులు, పాటింప వేయునా ♦ ర్నూట డెబ్బ
దా ఱగు భావమ ♦ హావత్సరంబున, భావనారాయణ ♦ దేవ దేవు
నానతివలన ని ♦ గ్రంథంబొనర్చియా, స్వామికి దేవతా ♦ చక్రవర్తి
కర్పణం బొనరించితి ♦ నధికభక్తి నిమ్మహాపుణ్యచారిత్ర ♦ మిందిరాత్రి
నాసుధాకరతారార్క ♦ మగుచు సజ్జనోత్తములయిండ్ల నెప్పుడు ♦ నుండుఁ
గాత.

క. పరమకృపాలవాల నిజ ♦ భక్తజనావనశీల యోగిహృ
త్సరసరోమరాళ దివి ♦ షన్మునిసంస్తుతిలోల దీనమం
దిరసురసాల సుప్రథిత ♦ నిర్మలకీర్తివిశాల యక్ష కి
న్నర నర సాధ్య ముఖ్యసుమ ♦ నస్సముదాయనితాంతపాలనా. 119

. అక్షుద్రభుజపరాక్రమ, శిక్షితదైతేయ నిఖిల ♦ శిష్టవిధేయా
చక్షుఃకర్ణకదంబా, ధ్యక్షాంగశయాన బుధవి ♦ తానవిధానా. 120

రలము, దర సుదర్శన శార్ఙ్గ నందక ♦ ధారణా శుభకారణా
హారిహాయప్రముఖాఖిలత్రిద ♦ శావనా మునిపావనా
సురవిరోధివరూథినీపరి ♦ శోషణా నతపోషణా
వరశకుంతకులాధినాయక ♦ వాహనా నవమోహనా. 12

గద్యము. ఇది శ్రీమత్కుక్కుటేశ్వర కరుణాకటాక్షనిరీక్షణసంలబ్ధసరసకవితా
సామ్రాజ్యధురంధర ఘనయశోబంధుర కౌండిన్యసగోత్రపవిత్ర కూచిమంచి
గంగనామాత్యపుత్త్రి సకలసంస్కృతాంధ్రలక్షణకళా కౌశలాభిరామ
తిమ్మకవిసార్వభౌమ ప్రణీతం బైనసర్పపురక్షేత్రమాహాత్మ్యం
బనుపుణ్యచరిత్రంబునందు సర్వంబును
దృతీయాశ్వాసము.

కాకినాడ ... ముద్రితము.